# Chandamama Press

VADAPALANI
MADRAS 26



OFFERS YOU...

FINEST PRINTING.—

Equipped with

PHOTO GRAVURE
KLIMSCH CAMERA
VARIO KLISCHOGRAPH-

—BLOCK MAKING

and a
host of Others....

# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్లు తోము కొనుట వల్ల దంత శాస్త్ర చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి!
కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచి కూడా—
కాల్గేట్‌తో నక్రమంగా పళ్లు తోముకోవటం పిల్లలకు చాలా ఇష్టం.

మీకు పౌడరు కావాలంటే,
ఈ ప్రయోజనాలన్నింటినీ
కాల్గేట్ టూత్ పౌడరు
వల్ల పొందండి...
ఒకరకా నెంల
తరబడి వస్తుంది!










శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతరటూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TL

# చందమామ

ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


మీ పసికందు మీకు ప్రాణసహితము. శ్రేష్ఠమైనవే మీ పాపకు ఇవ్వండి :




అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

• కడుపులోని బాధలను నివారించును
• జీర్ణవృద్ధిని చేయును • పాపలకు ఆరోగ్యదాయిని.

తయారుచేయువారు
అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4.

FDSAGM994 B'TI

# ఈమె కోసము మాత్రమే మేమున్నాము





రాధమ్మ అలాగే అనుకొంటారు. మేము కోరుకొనేదీ అదే. ఆమెకు సాయపడుటకు మేము శాయశక్తులా ప్రయత్నించేము. ఆమె పెళ్లి చేసుకొందుకు ఉద్యోగమునకు రాజీనామా యిచ్చినపుడు, ప్రావిడెంట్ ఫండును మా ఫిక్స్డ్ డిపాజిట్ స్కీములో వేయమని సలహాయిచ్చేము. తరువాత, ఆమె ఒక కుట్టు మెషీన్ కొనుక్కొందామనుకొంటే, మా రెకరింగ్ డిపాజిట్ స్కీమును గురించి చెప్పేము. దానిలో ఆమె సులభమైన నెలసరి వాయిదాలలో డబ్బు నిలవచేసుకొని చక్కగా కుట్టు మెషీను కొనుక్కొంది. సరే, ఆవిడ నగానట్రా యింటి దగ్గర దాచుకొందుకు భయపడుతూంటే, మా దగ్గర ఒక సేఫ్ డిపాజిట్ లాకరును అద్దెకు తీసుకోమన్నాము. ఇంక యిప్పుడు, రాధమ్మకు ఏ సమస్య ఉన్నా, మా సలహాకు వస్తుంది. మేమూ సరియైన దారి చూపిస్తాము. కనుక రాధమ్మ ఆమె కోసము మాత్రమే మేమున్నామని అనుకొంటుంది. ఆవిడ ఒక్కరే కాదు, మా లక్షలాదిమంది ఖాతాదారులూ యిలాగే అనుకొంటారు! (బాగుందా? మీరూ మా ఖాతాదారులయి చూడండి)



సిరిసంపదలకు అక్షయపాత్ర

## ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్

(స్థాపితము 1908) రెజిస్టర్డ్ ఆఫీస్ : మాండ్వి, బరోడా

భారతదేశములో మరియు విదేశములలో 300 పైగా బ్రాంచీలు కలవు

Shilpi BOB 11A/68 tel

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవుసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు —క్యాడ్‌బరీస్






Bensons/0391 TEL.

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

గృహము మనోహరముగా చిత్రమయముగా ఉండాలంటే!

గృహము అతి ఆధునికముగా నవ నవీనముగా ఉండాలంటే!

ఎప్పుడూ వాడవలసింది

# AMARJOTHI FABRICS

## BEDSPREADS - FURNISHINGS - FANCY TOWELS



A GREAT NAME 

IN HANDLOOMS

తయారీ :
అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్,
పోస్టుబాక్సు నం. 22, కరూర్ (ద.భా.)
బ్రాంచిలు : బొంబాయి—ఢిల్లీ

మద్రాసు ఏజెంట్లు :
అమర్‌జ్యోతి ట్రేడర్స్,
99, గొడౌన్ స్ట్రీట్, మదరాసు : 1
ఫోన్ : 34864

# Ensure Your Success

With

GLOBE







Other Famous Brands
of Geometry Boxes by **KASHYAPS**

**DELTA, KOH-I-NOOR, HORSE**

ACCURACY

KARAN

Mfg **G. S. KASHYAP & SONS** Pataudi House, Darya Ganj, Delhi-6

# అమృతాంజనము

## ఒళ్ళు నొప్పులను చప్పున తగ్గించే చల్లని మందు





- అమృతాంజనము ఏవిధంగానూ హాని చేయదు నొప్పి వున్నచోట కొద్దిగా రాస్తే చాలు
- అమృతాంజనము నొప్పిని త్వరగా తగ్గిస్తుంది ఇందులో అత్యంత శక్తివంతమైన పది ఔషధాలున్నాయి
- అమృతాంజనము రాసుకుంటే చల్లగా హాయిగా వుంటుంది. ఇందులో కర్పూరం, మెంథాల్ మొదలైనవి చేరివున్నాయి
- అమృతాంజనము ఖర్చు ఆదాచేస్తుంది ఒక్క సీసా ఎంతోకాలం ఆటివస్తుంది

75 ఏళ్లగా ఇంటింటి దీపమై వెలుగుతోంది

అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు బొంబాయి కలకత్తా
న్యూఢిల్లీ హైదరాబాదు




AMR - 14 Tel

'అదనపు
తెల్లదనము
ఎక్కడనుంచి
వస్తుంది ?'

Tinopal

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్

ఆఖరిసారి బట్టలు జాడించడానికి ముందు కాస్త టినోపాల్ వేయండి.

మరి చూడండి. మీ తెల్ల బట్టలన్నీ మిరుమిట్లు గొలిపేలా మెరుస్తాయి— షర్టులు, చీరెలు, దుప్పట్లు, తువ్వాళ్లు.

ఈ అదనపు తెల్లదనం మూలంగా మీకు ఖర్చు ఎంతో ? ఒక బట్టకు ఒక పైసా కూడా కాదు. టినోపాల్ శాస్త్రీయంగా తయారుచేయబడిన తెల్లదనమునిచ్చే తయారు. ఇది బట్టలకు ఏ విధంగానూ హాని చేయదు.

టినోపాల్ యొక్క ఇతర ప్యాకులు:



'డాబీకి సరిపోయే పొట్లము'



క్రొత్త మితవ్యయ ప్యాక్




® టినోపాల్ జె. ఆర్. గైగి ఎస్.ఎ. బాల్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు
సుహృద్ గైగి లిమిటెడ్, పి. ఒ. బాక్స 965, బొంబాయి 1 బిఆర్

Shilpi S.G 1A/68 Tel




అతని జీవనోపాధికి మంచి చదువు చెప్పించి అతని భావి శ్రేయస్సుకు బాట వేయవలసిన సమయం త్వరలో మీకు వస్తుంది. మంచి చదువంటే ఈ రోజుల్లో మాటలా? వ్యయంతో కూడిన పనే!
కాబట్టి అగర్భ శ్రీమంతులైతే తప్ప, ఎవరు గాని

## రేపు సుఖపడేందుకు నేడే ఆదా చేయాలి.

ఇందుకు మేలైనవి మా డిపాజిట్లు:

| | |
|---|---|
| ఫిక్సెడ్ డిపాజిట్లు: | వడ్డీ సాలుకు 6-5/8% వరకు |
| లేక సేవింగ్స్ డిపాజిట్లు: | వడ్డీ సాలుసరి 3-1/2% |
| లేక రికరింగ్ డిపాజిట్లు: | ఉద్యోగస్తులకు ఉత్తమమైనవి |

# ది ఆంధ్రా బ్యాంక్ లిమిటెడ్

(స్నేహపూర్వకమైన సేవ నిచ్చే సంస్థ)

(సెంట్రల్ ఆఫీసు: హైదరాబాద్)

మొత్తము బ్రాంచీలు: 121

కె. గోపాల్‌రావు
ఛైర్మన్

అందానికి సౌందర్యాన్ని సమకూర్చేది....









కాశ్మీర్

స్నో మరియు
టాల్కమ్ పౌడర్

THE NATIONAL TRADING CO.
Kashmir
BOMBAY 2 MADRAS

ది నేషనల్ ట్రేడింగ్ కంపెనీ,

బొంబాయి - 2 :: మదరాసు - 32



పొదుపునకు...

ప్రకాశవంతంగా, పరిశు-
భ్రంగా చిరకాలం, పొదు
పుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కెయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లవుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంత
మైన వెలుగునిచ్చే లాంపు

బెంగాల్ హంస

పాలతెలుపు లాంపు.



ఆంధ్రప్రదేశ్‌కు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
జి.ప. పరశురామ్ & కంపెని.
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్. 4. A.P.

బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెనీ, బెంగళూరు - 3 & మదరాసు - 17



## ముచ్చటైన ముగ్గులు వేయటం నేర్పుతున్నారా?
## ఫోర్‌హాన్స్‌తో సరియైన దంత సంరక్షణను నేర్పండి

మీ అమ్మాయి తను వేసే రంగవల్లి లాగా ముద్దు లొలికే పిల్ల. చిరునవ్వులు చిందిస్తూ ఆమె ఎప్పుడూ అలాగే ఉండాలంటే ఆ బాధ్యత మీ పైనే ఉన్నది. ఫోర్‌హాన్స్ ఏ విధంగా పళ్ళు ఎప్పుడూ తెల్లగా తళతళలాడేటట్లు, చిగుళ్ళు గట్టిగా, ఆరోగ్యంగా ఉండేటట్లు ఉంచగల్గుతుందో ఆమెకు యిప్పుడే చెప్పండి □ ఫోర్‌హాన్స్ ఒకదంత వైద్యునిచే నిర్మింపబడింది.
అందులో బిగువైన చిగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. అవి చిగుళ్ళ జబ్బులు రాకుండా చేస్తుంది. దంతక్షయాన్ని నిరోధిస్తుంది. ఫోర్‌హాన్స్ మీకు, మీ అమ్మాయికి తగిన టూత్ పేస్టు, కనుక ప్రతిరాత్రి, ఉదయం విధిగా ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో పళ్ళుతోముకోవడం ఆమెకు నేర్పండి. జీవితాంతం ఉండవలసిన పళ్ళకు తగిన సంరక్షణ కావాలి.

**జాగు చేయక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను ఇప్పుడే నేర్పండి**

ఉచితం : "పళ్లు, చిగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అనే రంగుల చిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి.
అడ్రసు : మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.
పేరు ______________________
అడ్రసు ______________________
† మీకు కావలసిన భాష క్రింద గీత పెట్టండి : తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.
• ఈ పుస్తకం మీరు చదివే పుస్తకాలలోకెల్ల ముఖ్యమైనది కావచ్చు




**ఫోర్‌హాన్స్**
**టూత్ పేస్టు—**
**ఒక దంతవైద్యుడు నిర్మించినది**

"C. 1"

39 F-182 TL

***Statement about ownership of CHANDAMAMA (Telugu)***
***Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956***

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. | *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | : | B. V. REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Prasad Process (Pvt) Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. | *Publisher's Name* | : | B. VISWANATHA REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Managing Partner,<br>Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. | *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. | *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS<br>1. Sri B. Viswanatha Reddi,<br>2. Sri B. L. N. Prasad,<br>3. Sri B. Venugopal Reddi,<br>4. Sri B. Venkatrama Reddy,<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada. |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March 1969*

***B. VISWANATHA REDDI***
*Signature of the Publisher*



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

పాతిక సంవత్సరాల పాటు జాతీయోద్యమానికి నాయకుడై, భారతదేశం గురించి ప్రపంచాని కంతకూ తెలిసేటట్టు చేసిన గాంధీ మహాత్ముడు బతికుంటే నూరేళ్ళవాడు. ఇంత పెద్ద దేశాన్ని స్వాతంత్ర్య సమరంలోకి దింపి, ఆ సమరాన్ని హింసారహితంగానూ, నీతిగానూ నడప గలిగినవాడు గాంధీజీ. అలాటి పురుషుడు మానవచరిత్రలో మరొకడు కనిపించడు. ఆయన జీవిత గాథను చందమామలో ఈ సంచిక నుంచీ ప్రకటిస్తున్నాము.

సంపుటి 44 మార్చి '69 సంచిక 3




# ఆస్తి పంపకం

ఒక గ్రామంలో ఒక పేదవాడికి ఇద్దరు కొడుకు లుండేవారు. చిన్నతనంలోనే తల్లి పోయింది. మరికొంత కాలానికి తండ్రి కూడా పోయాడు. తండ్రి వాళ్ళకు మిగిల్చి పోయిన ఆస్తి ఏమంటే, ఒక అవ్రూ, ఒక కొబ్బరిచెట్టూ, ఒక రజాయీ మాత్రమే.

పెద్దవాడు కుటిలుడు. చిన్నవాడు అమాయకుడు. అందుచేత పెద్దవాడు తన తమ్ముడితో, "తమ్ముడూ, మనం మన ఆస్తిని ఇప్పుడు పంచుకోవాలి. కాని ఆ పంచుకోవటంలో అది నాశనం కాకుండా చూసుకోవాలి. ఏమంటావు? ఆవును రెండుగా నరికితే ఇద్దరమూ నష్టపోతాము. అలాగే కొబ్బరిచెట్టును రెండుగా చీల్చినా, రజాయిని రెండుగా చించినా అవి నామ రూపాలు లేకుండా పోతాయి. అందుచేత మన ఆస్తికి ప్రమాదం లేకుండా పంచుకునే ఉపాయం నేను చెబుతాను. మన అవు ఉందనుకో, దాని ముందు భాగం నువు చూసుకో, వెనక భాగం నేను చూసుకుంటాను. అలాగే కొబ్బరిచెట్టు ఉంది గద, దాని కింది భాగం నువు వాడుకో, పై భాగం నేను వాడుకుంటాను. ఇక రజాయి ఉన్నది, దాన్ని పగలు నువు వాడుకో, రాత్రి నేను వాడుకుంటాను. అలా చేస్తే న్యాయంగా ఉంటుంది," అన్నాడు.

అమాయకుడైన తమ్ముడు, అన్న చెప్పిన మాటలు నమ్మి ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నాడు.

దీని ఫలితంగా చిన్నవాడు రోజూ ఆవును మేపేవాడు, దాని ముందు భాగం కడిగేవాడు; పెద్దవాడు దాని పాలు పితికి, తాను ఒక్కడే తాగేవాడు.

చిన్నవాడు కొబ్బరిచెట్టుకు రోజూ నీళ్లు పోసేవాడు; పెద్దవాడు దాని కాయలు కోసి, తాను ఒక్కడే తినేవాడు.

ఆర్. విశ్వేశ్వరరావు

చిన్నవాడు పగలు రజాయితో పని లేదు గనక, దాన్ని ఎండలో వేసి, దులిపి, శ్రద్ధగా మడిచి పెట్టేవాడు; పెద్దవాడు రాత్రివేళ వెచ్చగా దాన్ని కప్పుకునేవాడు.

పెద్దవాడు చిన్నవాడికి చేస్తున్న ఈ అన్యాయాన్ని ఊళ్లో ఉండే ఒక వృద్ధుడు పసిగట్టాడు. అన్న ఇంట్లో లేనప్పు డాయన వచ్చి చిన్నవాడితో, "బాబూ, నువు రోజూ శ్రద్ధగా మేపటం చూస్తున్నాను; అవు చక్కగా బలిసింది; బాగా పాలిస్తున్నదా? నువు తాగుతున్నావా? కొబ్బరిచెట్టుకు శ్రమపడి రోజూ నీళ్లు పోస్తున్నావు; కాయలు కూడా బాగా కాస్తున్నాయి; నువు వాటిని తింటున్నావా? రోజూ రజాయిని ఎంతో శ్రద్ధగా దులిపి, మడిచి పెట్టటం చూస్తున్నాను; రాత్రిపూట వెచ్చగా కప్పుకుని పడుకుంటున్నావా?" అని అడిగాడు.

"లేదండీ. అవు ముందు భాగమే నా వంతు; వెనక భాగం మా అన్నది. అలాగే కొబ్బరిచెట్టు కింది భాగమే నా వంతు, పైది అన్నది. రజాయి కూడా పగలే నాది, రాత్రి అన్నది," అని చిన్నవాడు చెప్పాడు.

"బాబూ, నిన్ను అమాయకుణ్ణి చేసి మీ అన్న చాలా మోసం చేశాడు. నేను చెప్పినట్టు చేస్తివా, వాడికి బుద్ధి వచ్చి నీకు



న్యాయం చేస్తాడు," అన్నాడు వృద్ధుడు. ఆయన చిన్నవాడికి తాను చెప్పవలసినది చెప్పి, వెళ్ళిపోయాడు.

మర్నాడు అన్న ఆవును పితకటానికి వచ్చి కూర్చునేసరికి, తమ్ముడు ఆవు ముఖం మీద చిన్న దెబ్బ వేశాడు. ఆవు కదిలింది.

"అదేమిట్రా అలా చేస్తున్నావు?" అన్నాడు అన్న.

"ఆవు ముందు భాగం నాదే గద. నా యిష్టం వచ్చినట్టు చేసుకుంటాను," అన్నాడు చిన్నవాడు.

ఈ తెలివితేటలు తమ్ముడి సొంతం కాదనీ, వాడి కెవరో బోధించారనీ అన్న తెలుసుకుని, "ఆవును కొట్టకు, తమ్ముడూ, పాలలో సగం నీ కిస్తాలే!" అన్నాడు.

తరవాత కొంతసేపటికి అన్న కాయలు కోసుకోవటానికి కొబ్బరిచెట్టెక్కాడు. ఆ సమయంలో తమ్ముడు గొడ్డలి ఒకటి తెచ్చి దాని మొదలు కొట్టసాగాడు. అదేమిట్రా అంటే, "నా చెట్టు భాగం, నా యిష్టం," అన్నాడు.

కాయలలో సగం ఇస్తూ ఉంటానన్నదాకా తమ్ముడు ఊరుకో లేదు. ఆ రాత్రి అన్న రజాయి తీసుకునేసరికి అది తడిసి ఉన్నది.

"ఈ రజాయిని ఎందుకు తడిపావు? దీన్ని ఎలా కప్పుకోవటం?" అని పెద్దవాడు చిన్నవాణ్ణి అడిగాడు.

"నాకూ అదే సమస్య వచ్చింది. పగలు కప్పుకుంటే రజాయి చాలా వేడిగా ఉన్నది. చల్లగా ఉండటానికి నీళ్ళలో ముంచాను," అన్నాడు చిన్నవాడు.

"రజాయిని ఎవరన్నా తడుపుకుంటారా? తడిపితే అది ఎందుకూ పనికి రాదు. కావలిస్తే రాత్రిపూట నువు కూడా రజాయి కింద పడుకోగాని, దాన్ని మాత్రం తడపకు!" అన్నాడు అన్న.

అటు తరవాత పెద్దవాడు తన తమ్ముడి పట్ల చాలా న్యాయంగా ఉంటూ వచ్చాడు.





# మూడు కుచ్చుల టోపీ

సింహళదేశంలో నిరుపేద వాడొకడుండే వాడు. వాడి కొక ధర్మాత్ముడు ఒక కోడె దూడను దానం చేశాడు. పేదవాడు ఆ కోడె దూడను అమ్ముదామని తీసుకుని నిర్జనమైన కాలిబాటను నడిచి పోతూండగా ముగ్గురు అల్లరి వెధవలు ఎదురుపడి, "ఏయ్? ఎక్కడికి పోతున్నావు?" అని అడిగారు.

"ఈ కోడెదూడను అమ్ముకోబోతు న్నాను," అన్నాడు పేదవాడు.

"అది మేక అయితే కోడెదూడ అంటా వేమిటి?" అని వాళ్ళు అన్నారు.

"ఇది మేక ఎందుకయింది? దూడే. ఇంకా వయసు రాలేదు," అన్నాడు పేదవాడు.

"మమ్మల్ని చూస్తే నీకు వేళాకోళంగా ఉన్నట్టుందే. మాకు మేక ఏదో, దూడ ఏదో తెలియదనా నీ ఉద్దేశం? దీన్ని ఎక్కడికో ఎందుకు తీసుకుపోతావు? మూడు రూపాయ లిస్తాం. మాకే అమ్మెయ్యి. ఇది అంతకన్న చెయ్యదు," అన్నారు అల్లరి వెధవలు.

వాళ్ళు రౌడీలలాగున్నారనీ, ఒంటరిగా ఉన్న తనను వాళ్ళు ఆ నిర్జనప్రదేశంలో ఏమైనా చెయ్యగలరనీ అనుకుని, పేదవాడు తన దూడను వాళ్ళకు నాలుగు రూపాయ లకు అమ్మటానికి సిద్ధమయాడు. వాళ్ళు వాడికి నాలుగు రూపాయలూ ఇచ్చి, దూడను తోలుకు పోసాగారు.

"దొంగ వెధవలు నన్ను భలే మోసం చేశారు. ఇందుకు ఏవిధంగానైనా వీళ్లమీద పగ తీర్చుకోవాలి," అనుకుని పేదవాడు వాళ్ళ వెనకే పరిగెత్తుకుపోయి, "నేను దిక్కులేనివాణ్ణి. నన్ను మీ వెంటనే ఉండ నివ్వండి. మీరు చెప్పినదెల్లా చేస్తూ, మీ సేవలో ఉంటాను," అన్నాడు.

యువకులు ఇందుకు సమ్మతించి, పేద వాణ్ణి తమ వెంట ఉండ నిచ్చారు. అందుకు

టి. సుందరమ్మ

వాళ్ళు చింతించ వలిసిన అవసరం కలగ లేదు. ఎందుకంటే, పేదవాడు వాళ్ళకు అడ్డమైన చాకిరీ చేసి, చాలా సుఖంగా జరిగే టట్టు చేశాడు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక ఆ పేదవాడు మూడు కుచ్చుల టోపీ ఒకటి నెత్తిన పెట్టుకుని యువకుల వద్దకు వచ్చాడు. ఆ టోపీని చూసి ముగ్గురూ విరగబడి నవ్వ సాగారు. "ఈ టోపీ మహత్తు తెలిసినట్టయితే దాన్ని చూసి మీరింతగా నవ్వరు," అన్నాడు పేదవాడు.

"దాని మహత్తేమిటో నువు చెప్పు, తెలుసుకుంటాం," అన్నారు యువకులు.

"ఈ టోపీ పెట్టుకుని ఎక్కడికి వెళ్ళినా నాకు కడుపు నిండా తిండీ, అంతులేని మర్యాదా జరుగుతుంది. నా జీవితం రాజోప చారంగా జరగటానికి ఈ ఒక్క టోపీ చాలు!" అన్నాడు పేదవాడు.

"ఎవరు నమ్ముతారు నీ కబుర్లు. నీ టోపీ మహత్తు రుజువు చెయ్యగలవా?" అని యువకులు పేదవాణ్ణి అడిగారు.

"రేపు ఉదయమే మీరు దీని ప్రభావం చూద్దురుగాని," అన్నాడు పేదవాడు. ఆ రాత్రే వాడు ఊళ్ళోని రెండు భోజన శాలలకు వెళ్ళి, తన దగ్గిర ఉన్న డబ్బు భోజనశాలల యజమానుల కిచ్చి, తానూ,



తన మిత్రులూ వస్తే ఎలా ప్రవర్తించాలో వాళ్ళకు చెప్పాడు.

మర్నాడు ఉదయం వాడు ముగ్గురు యువకులనూ వెంటబెట్టుకుని ఒక భోజన శాలకు వెళ్ళాడు. యజమాని ఎదురు వచ్చి, "దయచెయ్యండి, దయచెయ్యండి!" అని మర్యాద చేసి నలుగురినీ భోజనాల శాల సావడికి తీసుకుపోయాడు.

"నాకూ, నా మిత్రులకూ మంచి భోజనం కావాలి," అన్నాడు పేదవాడు.

భోజనశాల యజమాని నలుగురికీ సుష్టుగా భోజనం పెట్టి, వాళ్ళు వచ్చేసే టప్పుడు పేదవాడితో, "అయ్యా, దయ వుంచి తమరు ఇక్కడికి తరుచుగా వస్తూండాలి," అని వేడుకున్నాడు.

ఇది చూసి ముగ్గురు యువకులూ ఆశ్చర్యపోయారు. అన్నం అమ్ముకునే వృత్తి గలవాడు నలుగురికి భోజనం పెట్టి డబ్బు అడగకపోవటమే గాక, మళ్ళీ రమ్మంటు న్నాడు. మూడుకుచ్చుల టోపీ మహిమే అయి ఉంటుందా?

ఆ సాయంకాలం పేదవాడు ఆ ముగ్గురు యువకులనూ మరొక భోజనశాలకు తీసుకు పోయాడు. అక్కడ కూడా వాళ్ళకు ఇంత మర్యాదా జరిగింది. భోజనశాల యజమాని వాళ్ళను సాగనంపుతూ పేదవాడితో,



"తమరు అప్పుడప్పుడూ వచ్చి భోజనం చెయ్యకపోతే నేను చాలా బాధ పడతాను," అన్నాడు. యువకుల సందేహం తీరింది. ఆ కుచ్చులటోపీ నిజంగా మహిమగలదే. దాన్ని తమకు ఏకాడికైనా అమ్మమని వాళ్లు పేదవాణ్ణి వేధించసాగారు.

"దీన్ని అమ్మనా? అమ్మితే నా గతి ఏమిటి?" అన్నాడు పేదవాడు.

"ఒరే, మా దగ్గర ఉన్నదంతా ఇచ్చేస్తాం. దీన్ని మాకు అమ్మెయ్యి," అని యువకులు పేదవాణ్ణి బతిమాలుకున్నారు.

చివరకు వాడు, "మీరు చాలా మంచి వాళ్లు గనక మీకీ టోపీ అమ్ముతాను," అని వాళ్ళ దగ్గర ఉన్న డబ్బంతా తీసుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం ముగ్గురు యువకులూ కుచ్చుల టోపీ తమ వెంట తీసుకుని భోజనశాలకు వెళ్ళి, చక్కగా భోజనం చేశారు. వాళ్ళు వచ్చేస్తూంటే భోజనశాల యజమాని, డబ్బు లివ్వమని నిలవేశాడు. వాళ్ళు నిర్ఘాంతపోయి, "డబ్బు దేనికి?" అన్నారు. యజమాని వాళ్ళను దొంగలనీ, మోసగాళ్ళనీ నానా తిట్లూ తిట్టి, డబ్బు వసూలు చేసి మరీ పోనిచ్చాడు.

వాళ్ళు ఇవతలికి వచ్చి, "ఈ టోపీని ఎవరో ఒకరు నెత్తిన పెట్టుకుంటేగాని దీని మహిమ తెలియదు," అనుకున్నారు.

ఆ రాత్రి వారిలో ఒకడు ఆ టోపీ నెత్తిన పెట్టుకున్నాడు. ముగ్గురూ కలిసి రెండో భోజనశాలకు వెళ్ళి, సుఖంగా భోజనం చేశారు. వాళ్ళు డబ్బు ఇవ్వకుండా వచ్చేస్తుంటే అక్కడి యజమాని కూడా అటకాయించాడు. వాళ్ళ దగ్గిర డబ్బు లేదు. భోజనశాలవాడు వాళ్ళను మెత్తగా తన్నించి వదిలిపెట్టాడు.

బీదవాణ్ణి మోసం చేసినందుకు వాడు తమకు తగిన ప్రాయశ్చిత్తమే చేశాడని యువకులు తెలుసుకున్నారు.






## 15

[శిఖిముఖీ అతడి అనుచరులూ ఆకాశగుహ ప్రాంతం చేరేసరికి, అక్కడ చెంచులు కోలాహలంగా నాట్యాలు చేస్తున్నారు. నాగుమల్లి బంధించబడిన గుడిశెలో శిఖిముఖికి చెంచు వాడొకడు పట్టుబడ్డాడు. శిఖిముఖి పులిచర్మం కప్పుకున్నాడు. శిథిలాలయ పూజారి అది గ్రహించగానే, విక్రమకేసరి పులిని బోను నుంచి వదిలాడు. తరవాత.—]

ఈసారి తమ మీదికి వస్తున్నది, నిజమైన పులి అని శిథిలాలయ పూజారికీ, బడే చెంచుకూ తెలిసిపోయింది. పులి ఆ సరికే నలుగు రైదుగురు చెంచుల్ని పంజా దెబ్బలతో పడగొట్టింది. ఇక అక్కడ వుండటం ప్రమాదం అని తెలుసుకుని శిథిలాలయ పూజారి, ఆకాశగుహ పక్కనున్న కొండ అంచు కేసి పరిగెత్తసాగాడు. బడేచెంచు తన గుహ కేసి పారిపోతూ, అనుచరుల నుద్దేశించి, "చచ్చు వెధవల్లారా! పులిని చూసి భయపడుతున్నారా? నెగళ్ళలో మండే కట్టెలు తీసుకుని ఎదురు తిరగండి!" అని కేకలు పెట్టాడు.

చెంచులు తమ నాయకుడు చెప్పినట్టే భగభగ మండే కట్టెపుల్లలు తీసుకుని పులి మీదికి పరిగెత్తారు. నిప్పంటే భయపడని అడవి మృగం వుండదు. పులి మంటలు చూస్తూనే బెదురుకుని వెనుదిరిగింది.




ఇంతలో శిథిలాలయ పూజారి పెద్ద గొంతుతో, "ఎక్కడ్రా, భేరుండం! తొరగా వచ్చి చావు," అంటూ అరిచాడు.

పులి ప్రవేశంతో ఆకాశగుహ ముందు రేగిన గందరగోళంలో శిఖిముఖి, పూజారి ఎటు పరిగెత్తి పోతున్నదీ గమనించ లేదు. బడేచెంచు అందుబాటులో వున్నట్టు కన బడేసరికి, అతడు అటు కేసి పరిగెత్తాడు. శిఖిముఖి మీద ఒక కన్ను వేసి వుంచిన పూజారి, యిది చూస్తూనే తన నౌకర్ను గట్టిగా కేకపెట్టి పిలిచాడు.

"పూజారిదేవా, యిక్కడున్నాను, వచ్చే వచ్చే!" అంటూ సవరభేరుండం శిథిలాలయ పూజారి దగ్గిరకు పరుగు పరుగున వచ్చిచేరాడు.

"ఇక్కడ మనం వచ్చిన పని తీరి పోయింది. ఇక మన ప్రయాణం బ్రహ్మ పుత్రా నదీ లోయలకే," అంటూ పూజారి కొండ అంచు కేసి కదిలాడు.

"అయితే, యీ భేరుండాన్ని ఆకాశం లోకి ఎగరమని తమ సెలవా?" అన్నాడు సవరభేరుండం.

"ఈ కటిక చీకటిలో పై కెగరటం ప్రమాదం, ముందు లోయలోకే దిగిపోవాలి. చాప చుట్టి గట్టిగా కట్టావా? తాటి మోకును నే చెప్పిన కొండ రాతికి బలంగా బిగించావా?" అని అడిగాడు శిథిలాలయ పూజారి.

"తమ ఆజ్ఞ ప్రకారం అంతా సిద్ధపరిచి వుంచాను. కొండ కింది లోయలోకి ఎగిరి పోదామంటావా, దేవా?" అన్నాడు సవర భేరుండం.

"అలాంటి పిచ్చి పని చెయ్యకు, కాళ్లూ చేతులూ విరిగి చస్తావు. మోకు సాయంతో నేను ముందుగా లోయలోకి దిగుతాను. నువ్వు చాప చుట్టను ఎత్తుకుని కాస్త వెనకగా దిగు," అన్నాడు పూజారి.

ఇద్దరూ కొండ అంచుకు పోయారు. అక్కడ ఒక పెద్ద రాతికి బలమైన మోకు





ఒకటి కట్టబడి వున్నది. రాతి పక్కన తాళ్ళతో కట్టబడిన చాప చుట్ట ఒకటి వున్నది. అందులో బంధించబడి వున్నది నాగుమల్లే! ఆమె తల మాత్రం బయిటికి కనబడుతున్నది. అరవకుండా వుండేం దుకు ఆమె నోటికి అడ్డంగా ఒక వస్త్రం ముక్క బిగించారు.

శిధిలాలయ పూజారి, నాగుమల్లి కేసి ఓ మారు చూసి, తృప్తిగా తలాడించి రాతి దగ్గిరకు పోయి మోకును లాగి చూశాడు. తరవాత భేరుండం కేసి తిరిగి, "మోకు లోయలోకి దిగేందుకు సరిపడా వున్నదా?" అని ప్రశ్నించాడు.

"లోయలోకేంటి, దేవా! నువ్వు కాస్త మంత్రం ప్రయోగిస్తే అది బ్రహ్మపుత్రానది ఉత్తరం గట్టునే తాకేస్తుంది," అన్నాడు భేరుండం.

"ఈ రాత్రి తాగొద్దని చెప్పానే, తాగావా? ఏవిటా పిచ్చి మాటలు! నోరు మూసుకుని, ఆ చాప చుట్ట ఎత్తుకుని, నా వెనగ్గా లోయలోకి దిగు," అంటూ శిధిలాలయ పూజారి తాడు పట్టుకుని, కొండ మీంచి లోయలోకి దిగసాగాడు.

సవర భేరుండం చేతుల్ని పైకీ కిందికీ ఓ సారి వూపి, "అంతా పూజారిదేవుడి ఆజ్ఞ," అంటూ నాగుమల్లి కట్టబడి వున్న చాప చుట్టను భుజానికి ఎత్తుకోబోయేంతలో, ఆకాశగుహ వైపు నుంచి పెద్ద రణగొణ ధ్వని వినిపించింది.

భేరుండం బితుకు బితుకు మంటూ ఆకాశ గుహ కేసి ఓ క్షణకాలం చూసి, "పూజారి దేవా! ఆ శిఖిముఖీ వాళ్ళు, మన బడేచెంచు మీద దాడి చేస్తున్నట్టున్నది. మనం చెంచుకు సాయంపోవద్దా?" అన్నాడు.

"ఆ చెంచు చవటకు సాయం పోవటమా? ఛీ, నోరు మూసుకుని త్వరగా రా. ఆ చెంచు వెధవ, నే చెప్పిన పని ఒక్కటీ సక్రమంగా చేయలేకపోయాడు. వాణ్ణి





ఆ దయ్యాలపోతు మోసం చేస్తే, నేను వాళ్ళిద్దర్నీ మంత్రశక్తితో బుద్ధిహీనుల్ని చేసి, నాగుమల్లిని వశం చేసుకున్నాను. ఇక వాళ్ళనీ వాళ్ళనీ కొండ మీంచి దూకి చావనీయ్," అన్నాడు శిథిలాలయ పూజారి.

"పాపం, బడేచెంచు మంచివాడు! అతడికి శిఖిముఖి చేతుల్లో చావు రాసిపెట్టి వున్నదిగామాలు!" అని ఓసారి గట్టిగా గొంతు సవరించుకుని సవరభేరుండం, నాగుమల్లిని వీపుకు వేలాడవేసుకుని మోకు సాయంతో లోయలోకి దిగసాగాడు.

సవరభేరుండం ఊహించినట్టే ఆకాశ గుహ ముందు శిఖిముఖీ అతడి అను చరులూ, బడేచెంచుతోపాటు అతడి ముఠా వాళ్ళను చుట్టుముట్టారు. ఆ ప్రయత్నంలో చెంచుల్లో ఇద్దరుముగ్గురు బాగా గాయ పడ్డారు కూడా. సాధ్యమైతే ఎలాంటి రక్త పాతం లేకుండా చెంచుల్ని లొంగదీసుకుని, నాగుమల్లిని బంధవిముక్తురాల్ని చేసి తీసుకుపోవా లనుకున్న శిఖిముఖి, బడే చెంచుతో, "మీవాళ్ళ నందర్నీ ఆయుధాలు కింద పడవేయమని చెప్పు. అలా చేస్తే మీలో ఎవరికీ హాని కలిగించను. నాక్కావల సింది సవరనాయకుడి కూతురు నాగు మల్లి," అన్నాడు.

"నాగుమల్లినే కాదు, శిథిలాలయ పూజా రిని కూడా మా వశం చెయ్యాలి," అన్నాడు విక్రమకేసరి ఈటెను బడేచెంచు కేసి గురి చేస్తూ.

బడేచెంచు గడగడ వణికిపోతూ, "ఇందులో నా తప్పేమీ లేదు. ఏదో దురాశ కొద్దీ డబ్బాశ పడి నాగుమల్లిని పట్టి తెచ్చాను. ఆవిడ తండ్రి చాలా డబ్బున్న వాడని విన్నాను. కాని చివరికిట్లా జరి గింది!" అన్నాడు.

"జరగబోయే దానితో పోలిస్తే, యీ జరిగింది నీకు సన్మానం కింద లెక్క. ముందు చెప్పు, ఆ పూజార్నీ, నీ దయ్యాల

పోతునూ ఎక్కడ దాచావ్?" అంటూ విక్రమకేసరి, బడేచెంచు కేసి రెండడుగులు వేశాడు.

బడేచెంచు మరింతగా వణికిపోతూ ఏదో అనబోయేంతలో, కంచె ప్రాంతాల్నించి, దయ్యాలపోతు ఏడ్పుగొంతుతో, "ఈ పులి మాటే అందరూ మర్చినట్టుంది. బాబులూ, వచ్చి సాయపడండి! ఇది నా గొంతు కొరికేందుకు చూస్తున్నది," అని కేక పెట్టాడు.

దయ్యాలపోతు కేక వింటూనే విక్రమకేసరి ఇద్దరుముగ్గురు అనుచరులతో కంచె దగ్గిరికి పరిగెత్తాడు. పులి కంచె కానుకుని నిలబడి వున్నది. చెంచు దయ్యాలపోతు మోకాళ్ళ మీద కూర్చుని, ఆరిపోవటానికి సిద్ధంగా వున్న ఒక నిప్పుకట్టెను దాని కేసి పూపుతున్నాడు. పులి మీదికి దూకేందుకు కోరలు చాచి గుర్రు పెడుతున్నది.

"ఈ దయ్యాలపోతును తెల్లారింతర్వాత పులికి ఆహారంగా వేద్దాం. ప్రస్తుతానికి యితడితో మనకు పని వున్నది. మీరు రెండుమూడు మండేకట్టెలు తెండి. పులిని మెల్లిగా తిరిగి బోనులోకి పంపుదాం," అన్నాడు విక్రమకేసరి.

విక్రమకేసరి యిలా అనగానే శబరులు నెగళ్ళ దగ్గిరకు పరిగత్తిపోయి బాగా





మండుతున్న కట్టెలతో తిరిగి వచ్చారు. విక్రమకేసరి, దయ్యాలపోతు పారిపోకుండా ఒకణ్ణతనికి కాపలా పెట్టి, రెండు చేతుల్లో రెండు మండుతున్న కట్టెల్ని పట్టుకుని పులిని సమీపించాడు. పులి పెద్దగా ఓసారి గాండ్రించి, వెనుదిరిగి కంచెవారగా నడవ సాగింది. అది కంచె అవతల బోను వున్న ప్రదేశం చేరగానే, ఒకడు దాన్ని రెండవ వైపు నుంచి అటకాయించాడు. పులి పంజా సాచి అతని మీద దూకబోయినదల్లా, భయ పడి బోనులో జొరబడింది. వెంటనే విక్రమ కేసరి కంచె పైకెక్కి బోను తలుపును దభీ మంటూ మూసేశాడు.



విక్రమకేసరి, చెంచు దయ్యాలపోతు దగ్గిరకు తిరిగి వచ్చేసరికి, వాడు జుట్టు పీక్కుంటూ మతిపోయిన వాడిలా గొణు క్కుంటున్నాడు. విక్రమకేసరి కాపలా వున్న శబరవాణ్ణి పక్కకు పిలిచి, "ఏమిటి వాడు వాగేది? పారిపోవాలని ఏమైనా ప్రయత్నం చేశాడా?" అని అడిగాడు.

"దయ్యాలపోతుకు పిచ్చెక్కిందని నా కనుమానం కలుగుతున్నది, దొరా! పూజారి గాడెక్కడ అని అడిగితే, నా మాట విని పించుకోకుండా, 'వాడెత్తుకు పోయాడు, చావు తప్పదు, పులివాత పడక తప్పదు,' అంటూ ఒకే వరసన గొణుగుతున్నాడు," అన్నాడు శబరుడు.

విక్రమకేసరి, దయ్యాలపోతును భుజం పట్టుకుని కుదిలించి, "ఆ గొణుగుడు మాని, నిజం చెప్పు. ఎత్తుకుపోయిం దెవర్ని? చావు తప్పం దెవరికి? నాగుమల్లిని ఎక్కడ దాచావు?" అని ప్రశ్నించాడు.

దయ్యాలపోతు ఆ ప్రశ్నతో ఈ లోకం లోకి వచ్చినవాడిలా విక్రమకేసరిని నిలువు గుడ్లేసుకుని ఓ క్షణకాలం చూసి, "నాగు మల్లిని నేను దాచిన గుడిసెలోంచి ఆ పూజరి ఎత్తుకుపోయాడు. నేను అన్న మాట తప్పానని శిఖిముఖి నన్ను పులికి





మేతగా వేస్తాడు...నాకు చావు తప్పదు," అన్నాడు బొంగురుగొంతుతో.

దయ్యాలపోతు మాటల్తో విక్రమకేసరికి, నాగుమల్లిని శిథిలాలయ పూజారి ఆకాశ గుహ ప్రాంతం నుంచి చల్లగా మరెక్కడికైనా దాటవేశాడేమో అన్న సంశయం కలిగింది. అతడు మారు మాటాడకుండా దయ్యాలపోతును మెడ పట్టుకుని బరబరా శిఖిముఖి వున్న చోటుకు లాక్కువచ్చి, అతడన్న మాటలు శిఖిముఖికి చెప్పాడు.

శిఖిముఖి పట్టరాని కోపంతో ఈటె పైకెత్తి, "దయ్యాలపోతూ, నీకు చావు తప్పదు. నువ్వూ, ఆ పూజారి దుర్మార్గుడూ తోడుదొంగలు. వాడి కోసం యీ చుట్టు పక్కల అంతా గాలించాం, కనిపించలేదు. నాగుమల్లి కూడా కనబడటం లేదు. వాడు దాగే రహస్యస్థలం ఎక్కడ?" అన్నాడు.

"ఆ దుర్మార్గుడూ నేనూ బద్ధ శత్రువులం, దొరబాబూ! ఆ సంగతి మా బడే చెంచుకూడా తెలుసు. నాగుమల్లిని నువ్వు దాయమన్న గుడిసెలోనే దాచాను. వాడూ, వాడి నౌకరూ చీకటి పడింతర్వాత ఒకటికి రెండుసార్లు కొండ అంచు కేసి పోవటం చూశాను. అక్కడేమన్నా..." అంటూ దయ్యాలపోతు ఆగిపోయాడు.



శిఖిముఖి, దయ్యాలపోతు మెడ పట్టుకుని, "త్వరగా రా. ఆ ప్రదేశం ఏదో చూపు," అన్నాడు తొందరపెడుతూ.

దయ్యాలపోతు కొండ అంచు కేసి గబగబా నడిచాడు. అతని వెన్నంటి పోయిన శిఖిముఖీ, విక్రమకేసరులకు శబరవాళ్ళు తెచ్చిన కాగడాల వెలుగులో, ఒక పెద్ద గండశిలా, దానికి కట్టివున్న బలమైన తాటి మోకూ కనిపించినై. శిఖిముఖి చప్పున వంగి మోకును బలంగా లాగి చూశాడు, అది బిగుసుకుపోయి వుంది. అప్పు డతను తల వంచి దాన్ని చెవికానించుకుని కొద్ది సేపు విని "మోకు ఆధారంతో ఆ పూజారీ



వాళ్ళు కొండ మీంచి లోయలోకి దిగిపోతు న్నారు, అనుమానం లేదు," అన్నాడు.

"అలా అయితే ఒక్క వేటుకు మోకు నరకండి. ఆ నీచుడు కింది లోయలో రాళ్ల మీద పడి తల పగిలి చస్తాడు," అన్నాడు బడేచెంచు ఆ సమయాని కక్కడికి వచ్చి.

"చెంచూ! తొందరపడి అలాంటి బుద్ధి తక్కువ పని చేసేవు. అలా మోకు నరికితే చచ్చేది ఒక్క పూజారే కాదు, అతడి వెంట నాగుమల్లి కూడా వున్నది," అన్నాడు శిఖి ముఖి. అతడు యిలా అనేంతలో చెంచుల్లో కొందరు తమ చేతుల్లో వున్న కాగడాలను లోయలోకి విసిరారు. వాటి వెలుగులో మోకు సాయంతో కిందికి దిగిపోతున్న శిధి లాలయ పూజారీ, సవరభేరుండం, అతడి భుజాన వేలాడుతున్న చాప చుట్టా— అందరికీ కనిపించినై.

"శిఖీ! ఇప్పుడేమిటి ఉపాయం? ఆ దుర్మార్గుడు నాగుమల్లితో కూడా మనకు కనిపించకుండా పారిపోయే ప్రమాదం వున్నది," అన్నాడు విక్రమకేసరి.

"నేనూ మరో మోకు సాయంతో వాడి వెంట బడతాను. ఈ వున్న మోకు నలు గురిని మోయలేక పోవచ్చు," అని శిఖి ముఖి బడేచెంచుతో, "త్వరగా ఒక మోకు తెప్పించు," అని చెప్పాడు.

క్షణాల మీద చెంచులు ఒక మోకు తెచ్చారు. శిఖిముఖి దాని కొస నొకదాన్ని గండశిలకు కట్టించి, మిగతా దాన్ని లోయ లోకి జార్చి, దాని వెంట కిందికి దిగుతూ, "కాగడాలను పూజారీ వాళ్లకు తగలకుండా కొంచెం దూరంగా విసరండి," అన్నాడు.

చెంచులు విసిరిన కాగడాల వెలుగులో శిధిలాలయ పూజారీ వాళ్ళు దాదాపు లోయ అడుగు భాగాన్ని చేరబోవటం శిఖిముఖికి కనిపించింది. వెంటనే అతడు మోకు వెంట సర్రుమంటూ వేగంగా లోయలోకి దిగసాగాడు. —(ఇంకా వుంది)






# ఇద్దరు వైద్యులు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, సామాన్య మానవులు నీ లాగా భూత పిశాచ బేతాళాలతో సాంగత్యం చెయ్యలేరు. చేసినట్టయితే సమీరుడి లాగా మోసపోతారు. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు సమీరుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చాలాకాలం క్రితం ఒక గ్రామంలో సమీరు డనే ఆయుర్వేదవైద్యు డుండేవాడు. ఆ గ్రామానికి నీహారు డనే మరొక వైద్యుడు కూడా వచ్చాడు. ఇద్దరికీ సఖ్యం కుదిరింది. అందుచేత ఇద్దరూ కలిసికట్టుగా వైద్యం చేద్దామనీ, వచ్చినది సమంగా పంచుకుందామనీ నిర్ణయించుకున్నారు.

## బేతాళ కథలు



31 17




సమీరుడికి వివాహమయింది. అతని భార్య చాలా చక్కనిది. సమీరుడికి ఆ భార్య అంటే చాలా ఇష్టం. నీహారుడు ఒంటరివాడు.

ఒకనాడు ఉదయం వైద్యుల వద్దకు ఒక కుఱ్ఱవాణ్ణి తెచ్చారు. వాడి మెడమీద చిన్న గాటున్నది. ఒంటిమీద రక్తం మరకలు లేవుగాని, నాడి చూస్తే బలహీనంగా ఉన్నది. కుఱ్ఱవాడు కొంత రక్తం పోగొట్టుకున్నట్టు కనిపించాడు. కిందటి రాత్రి పడుకునేటప్పుడు మామూలుగానే ఉన్నాడు. రాత్రి ఏమి జరిగినదీ తెలియలేదు. జరిగినదేమిటో చూసినవారు లేరు.



నీహారుడు ఆ కుఱ్ఱవాడికి బలం పట్టే ఔషధా లిచ్చి, ఆ రాత్రికి తన ఇంటనే వాణ్ణి పడుకోనిచ్చాడు. తాను విల్లూ బాణమూ తీసుకుని ఒక పక్కన దాక్కున్నాడు.

అర్ధరాత్రివేళ ఒక భయంకర పిశాచాకారం కిటికీ కుండా కుఱ్ఱవాడున్న గది ప్రవేశించింది. నీహారుడు బాణంతో ఆ పిశాచాన్ని కొట్టాడు. బాణం సూటిగా వెళ్ళి పిశాచి ఎడమ తొడమీద తగిలింది. పిశాచి వెంటనే వెనక్కు తిరిగి కిటికీ కుండా ఎగిరిపోయింది.

ఆ పిశాచే కుఱ్ఱవాడి మెడమీద గాటు పెట్టి క్రితంరాత్రి వాడి రక్తం పీల్చిందని నీహారుడికి రూఢి అయింది.

మర్నాడు ఉదయం సమీరుడు నిద్ర లేస్తూనే తన భార్య చీర నిండా రక్తం మరక లుండటం చూసి, "ఏమిటిది?" అని అడిగాడు.

"తెల్లారుఝామున నీళ్ళు తెద్దామని బయటికి వెళితే ఏ బోయవాడో బాణంవేసి కొట్టాడు," అన్నది సమీరుడి భార్య.

సమీరుడు ఆమె గాయానికి మందువేసి కట్టుకట్టి, నీహారుడి ఇంటికి వెళ్ళి కుఱ్ఱవాడి సంగతి విచారించాడు. రాత్రంతా





వాడు సుఖంగానే నిద్రపోయాడు. ఇప్పుడు వాడు మామూలుగానే ఉన్నాడని నీహారుడు చెప్పాడు.

"ఈ ఊళ్లో అన్నీ విచిత్రాలు జరుగుతున్నాయి. తెల్లవారుఝామున చీకట్లో నా భార్య నీళ్ళ కోసమని బయలుదేరితే ఎవరో బోయవాడు బాణం వేసి కొట్టాడు. తొడ మీద బలంగా గాయమయింది," అన్నాడు సమీరుడు.

"ఏ తొడమీద?" అన్నాడు నీహారుడు.

"ఎడమ తొడమీద," అన్నాడు సమీరుడు.

"నీ కొక అప్రియమైన విషయం చెప్పాలి. నీ మంచికోరే చెబుతున్నాను. నీ భార్య పిశాచి," అన్నాడు నీహారుడు. ఆమెను కొట్టిన "బోయవాడు" తానేనని అతను చెప్పలేదు.

సమీరుడికి తన భార్య మీద వెర్రిప్రేమ. ఆమె పిశాచి అని నీహారు డనేసరికి అతనికి తల తిరిగినట్టయింది.

"నేను నమ్మను! ఎంతమాత్రమూ నమ్మను," అన్నాడు సమీరుడు.

"నా మాట నువ్వెందుకు నమ్మాలి? ఈ రాత్రికి నిద్రపోతున్నట్టు నటించి, నీ భార్య ఏమిచేసేదీ నువ్వే కనిపెట్టు. నిజం నీకే తెలుస్తుంది," అన్నాడు నీహారుడు.




అతను చెప్పినట్టే సమీరుడు ఆ రాత్రి నిద్రపోతున్నట్టు కదలకుండా పడుకుని, తన భార్య ఏమి చేసేదీ జాగ్రత్తగా గమనించసాగాడు.

అర్ధరాత్రివేళ సమీరుడి భార్య చప్పుడు చెయ్యకుండా పక్క మీది నుంచి లేచి, ఒళ్ళు విరుచుకుని, భయంకరమైన పిశాచిగా మారి, కిటికీ కుండా రివ్వున ఎగిరిపోయింది. ఒక గంట తరవాత ఆమె తిరిగి వచ్చి మామూలు మనిషి అయింది. ఆమె మూతి రక్తసిక్తమై ఉన్నది.

నీహారుడు చెప్పినది అక్షరాలా నిజం. తన భార్య పిశాచి!






తెల్లవారగానే సమీరుడు నీహారుడి వద్దకు వెళ్లి, "నా భార్య నిజంగా పిశాచే. నాకు దాన్ని చూస్తేనే దడగా ఉన్నది," అని రాత్రి తాను చూసినది యావత్తూ చెప్పి, "నన్నిప్పుడేం చెయ్యమంటావు?" అన్నాడు.

"నన్నడగాలా? దాన్ని ధ్వంసం చేసెయ్యి," అన్నాడు నీహారుడు.

"నావల్లకాదు. నే నాపని చెయ్యలేను," అన్నాడు సమీరుడు. అతనికింకా ఏ మూలో భార్య మీద మమకారం ఉన్నది.

"నీవల్ల కాకపోతే నేనే ఆ పని చేస్తాను. ఇవాళ మధ్యాహ్నంవేళ నువు ఎక్కడైనా వెళ్ళు," అన్నాడు నీహారుడు.

మధ్యాహ్నం కాకముందే సమీరుడు ఇంటి నుంచి బయలుదేరాడు. తాను తిరిగి ఇంటికి చేరుకునేటప్పటికి తన భార్య చచ్చి ఉంటుంది. తనకు ఇంతకుమించిన ఘోరం ఇంకొకటిలేదు. నీహారుడు తన భార్య పిశాచి అని చెప్పకపోతే తాను ఆమెతో ఎంత కాలమైనా సుఖంగా కాపరం చేసి ఉండేవాడే. నీహారుడి వల్ల తనకు నష్టమే తప్ప లాభమేమీ కలగలేదు. అతను తనకు రావలిసిన సొమ్ములో సగం వంతు పుచ్చుకుంటున్నాడు. అతను లేకపోతే ఇన్నాళ్ళూ ఆ డబ్బంతా తనదే అయి ఉండేది. తన భార్య సంగతి తనకు తెలిసేదికాదు. ఆమె ప్రాణానికి ఈ విధంగా అపాయం వచ్చి ఉండేదికాదు.

క్రమంగా సమీరుడి విచారమంతా నీహారుడిపై పగగా మారింది. అతను తిన్నగా న్యాయాధికారి వద్దకు వెళ్ళి, "అయ్యా, నీహారుడు నా భార్యను హత్య చెయ్యాలనే ప్రయత్నంలో ఉన్నాడు. దానికి కారణమేమంటే, అతను నా భార్యను కామించాడు. ఆమె అతన్ని నిరసించింది," అని చెప్పి, న్యాయాధికారి అనుమతితో కొందరు సాయుధులైన భటులను తన ఇంటికి తీసుకు వచ్చాడు.

వాళ్ళు వచ్చేసరికి నీహారుడు, అప్పుడే సమీరుడి భార్యను కత్తితో నరికి చంపి, బయటికి వస్తున్నాడు. భటులు అతన్ని పట్టుకున్నారు.

నీహారుడు సమీరుడి కేసి తిరిగి, "మిత్రమా, నీ యుక్తి చాలా బాగున్నది. నీకు పిశాచి భార్య పీడ విరగడ చెయ్యటానికి నన్ను ఉపయోగించుకున్నావు. నా పీడ విరగడ చేసుకుని వైద్యం మీద వచ్చే డబ్బంతా నువే ఉంచుకోవాలనుకున్నావు! అలాగే కానీ!" అంటూ భయంకరంగా నవ్వి, పిశాచరూపం ధరించి, ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సమీరుడూ, నీహారుడూ ఒకరినొకరు మోసగించుకున్నారు. ఎవరిది ఎక్కువ మోసం? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇద్దరూ ఒకరినొకరు మోసం చేసుకున్న మాట నిజమే గాని, ఇద్దరి మోసాలూ ఒక రకమైనవి కావు. నీహారుడు తాను పిశాచాన్నన్న సంగతి సమీరుడికి చెప్పలేదు. వారు వైద్యంలో భాగస్వాములు. నీహారుడు వైద్యం సంబంధించినంతవరకు సమీరుణ్ణి మోసగించలేదు. సమీరుడి భార్య పిశాచి అని అతనికి మొదటి నుంచీ తెలిసి ఉండవచ్చు. కాని వైద్యధర్మంలో అతను తమ రోగిని ఆమె పీడిస్తున్నదని తెలిసినప్పుడే ఆ సంగతి బయటపెట్టాడు. సమీరుడు అలాకాక, తన పిశాచి భార్యను నిర్మూలించి, తనకు ఉపకారం చేసిన మిత్రుణ్ణి తన స్వార్థానికి బలి చేయ యత్నించాడు. సమీరుడి మోసం క్షమించరానిది," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# ఏది గొప్ప?

ఒక రాజు వద్దకు ఇద్దరు శిల్పులు వచ్చారు. రాజు వారిని తన కుమార్తె ప్రతిమను ఒకే భంగిమలో తయారు చెయ్యమన్నాడు. ఆమె రూపాన్ని ఇద్దరు శిల్పులూ తయారుచేశారు.

రెండు ప్రతిమలూ ఒకే అచ్చులో తయారైనట్టుగా ఒక్కటిగానే వున్నాయి. సహజమైన రంగులతో అవి చాలా వాస్తవమనిపించేటట్టు కూడా ఉన్నాయి. వాటిని రాజసభలో ఉంచినప్పుడు సభికులంతా విస్మయం చెంది, "రాజకుమార్తె ప్రత్యక్షంగా నిలబడ్డట్టే ఉన్నది. చేతిలో పళ్ళెం అసలు బంగారం లాగే ఉన్నది. అందులో పళ్ళు నిజమైన పళ్ళ లాగె ఉన్నాయి," అని తెగ మెచ్చుకున్నారు. ఇద్దరు శిల్పులకూ సమంగా బహుమతి ఇవ్వ వచ్చునని వారు రాజుగారితో అన్నారు.

"అలా కాదు. ఈ శిల్పాలకు చిన్న పరీక్ష పెడదాం," అన్నాడు రాజు.

రెండు ప్రతిమలను పక్కపక్కనే ఉంచి, ఆయన తన పెంపుడు చిలకలలో ఒక దాన్ని విడిచాడు. అది ఒక ప్రతిమ చేతిలో ఉన్న పళ్ళెం మీద వాలి, అందులోని పండును తినటానికి యత్నించి, సాధ్యంకాక ఎగిరిపోయింది.

రాజు తన రెండో పెంపుడు చిలకను వదిలాడు. అదీ మొదటి చిలక లాగె చేసింది.

"ఆ శిల్పమే గొప్పది," అన్నారు అందరూ.

"కాదు రెండవదే గొప్పది. దానికే హెచ్చు బహుమానం ఇస్తాను," అన్నాడు రాజు. అందరూ నివ్వెరపోయి కారణమడిగారు.

"చిలకలు మొదటిది ప్రతిమ అనుకుని దాని మీద వాలాయి. రెండోది నిజమైన మనిషి అనుకుని దాని జోలికి పోలేదు. జాగ్రత్తగా గమనించండి. రెండో ప్రతిమ కళ్ళలో ఉండే సజీవమైన మెరుపు మొదటిదానిలో లేదు. రెండోది చేసినవాడే గొప్ప శిల్పి," అన్నాడు రాజు.







# పిల్లికి పెళ్లి!

సువర్ణగిరి రాజైన జయచంద్రుడికి చంద్రావతి అని ఒకే కుమార్తె ఉండేది. అందరూ చేరి గారాబం చెయ్యటంతో చంద్రావతి బుద్ధి ఏమంత వికసించలేదుగాని, ఏళ్ళు వచ్చే కొద్దీ ఆమె మహా అందమైన బొమ్మగా తయారయింది.

కాలక్షేపానికిగాను చంద్రావతి ఒక పిల్లి కూనను పెంచింది. అది కూడా చంద్రావతి లాగే అల్లారు ముద్దుగా పెరిగి, చంద్రావతితో బాటే పెద్దదయింది.

యుక్తవయస్కురాలైనాక చంద్రావతిని పెళ్ళాడటానికి అనేక దేశాల రాజకుమారులు తహతహ లాడుతూ, వర్తమానాలు పంప సాగారు. వారిలో పద్మపురి యువరాజు జయంతుడు జయచంద్రుడికి నచ్చాడు. ఎందుకంటే, జయంతుడు మంచి అంద గాడూ, బుద్ధిమంతుడూనూ. అదీగాక పద్మపురి ఖ్యాతిగల రాజ్యం.

జయచంద్రుడు తన కుమార్తె దగ్గిర పెళ్ళి ప్రస్తావన తేగానే ఆమె, "నా పిల్లికి ముందు పెళ్ళి కావాలి," అని మంకుపట్టు పట్టింది.

"అదొక సమస్యా ఏమిటి? నీ పెళ్ళి స్థిరమైతే పిల్లికి పెళ్ళి ఎంత సేపు?" అన్నాడు రాజు.

బుద్ధి వికసించని చంద్రావతి, "నా పిల్లికి కూడా తగిన పిల్లితోనే పెళ్ళి జరగాలి. అటువంటి పిల్లిని ఎవరు తెస్తే వాడే నాకు తగిన మొగుడు!" అన్నది. తండ్రి ఎంతగా చెప్పి చూసినా ఆమె బుద్ధి మారలేదు.

జయచంద్రుడు కుమార్తె మీద ఆగ్రహించలేక, మంత్రితో అంతా చెప్పి, "చిక్కు ఎలా విడేట్టు? మంచి సంబంధం పోయేట్టుగావుంది," అన్నాడు.

"అమ్మాయిగారికి తృప్తి కలిగేటట్టుగా ఏదైనా చిన్న నాటకం ఆడి మనం కోరిన

చావలి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రకారమే పని వెళ్ళ మార్చుదాం," అన్నాడు మంత్రి నిశ్చింతగా.

"అదంతా నువే చూడు మరి. నా బుర్ర పని చెయ్యటం లేదు," అన్నాడు రాజు.

మర్నాడు మంత్రి చాటింపు వేయించాడు. ఆ రోజే ఆయన జయంతుణ్ణి ఆహ్వానిస్తూ పద్మపురికి మనిషిని పంపాడు.

"రాజకుమార్తె పెంపుడు పిల్లికి తగిన పిల్లిని తెచ్చిన వారిని రాజకుమార్తె చంద్రావతీ దేవి వివాహం చేసుకుంటుంది," అని ఊళ్ళో దండోరా వేశారు. ఆ చాటింపు విని చంద్రావతి పరమానందభరితురాలయింది. ఊళ్ళోని కుర్రకారు వాళ్ళు మరింత మరమానందభరితులయారు. గండు పిల్లిని సంపాదించగల వాళ్ళందరూ చంకన పిల్లిని పెట్టుకుని రాజభవనం దగ్గిర హాజరయారు. మంత్రి వారందరినీ లోపలికి పిలిచి ఇలా చెప్పాడు:

"విన్నారా, ఇందులో ఒక పేచీ ఉన్నది. పిల్లి రాజకుమార్తె పిల్లికి తగినదో కాదో రాజుగారూ, రాణీగారూ, రాజకుమార్తే నిర్ణయిస్తారు. ఇందులో ఎవరు పిల్లిని ఎన్నిక చేయకపోయినా తల తీయించి కోట గుమ్మానికి కట్టే బాధ్యత నా పైన ఉన్నది. అందుచేత ముందుగా బాగా ఆలోచించి మరి ఉపక్రమించండి."



ఈ మాట విన్నవాళ్ళందరూ వచ్చిన దారే పట్టారు. రాజకుమార్తెను పెళ్ళాడటం తేలిక అనుకున్నందుకు వాళ్ళు తమను తాము తిట్టుకున్నారు.

తన పిల్లికి తగిన పిల్లిని ఎవరూ తీసుకు రానందుకు చంద్రావతి ఆరాటపడసాగింది.

"తొందర పడకు, తల్లీ! నీ పిల్లి ఏమన్నా మామూలు పిల్లా? దానికి తగిన పిల్లి దొరకటం మాటలు కాదు. కాని తప్పక దొరికి తీరుతుంది, అలా చూస్తూ ఉండు," అన్నాడు మంత్రి.

వారం తిరిగేసరికల్లా జయంతుడు పద్మ పురి నుంచి వచ్చి చేరాడు. ఈ లోపల మంత్రి ఒక అందమైన గండు పిల్లిని సంపా దించి ఉంచాడు. ఈ పిల్లికి ఇంత వెన్నా మీగడా పెట్టి, దాని ఒంటికి కొద్దిగా వెన్న రాచి, దాన్ని చంకన పెట్టుకురమ్మని జయంతుడికి చెప్పి, మంత్రి అతన్ని రాజ మందిరానికి తెచ్చాడు.

రాజకుమార్తె తన పిల్లిని గండుపిల్లి దగ్గిర పెట్టగానే, దాన్ని మూచూసి, దాని ఒళ్ళంతా నాక నారంభించింది.

చంద్రావతి పరమానందంతో చప్పట్లు కొడుతూ, "ఆహా, నా పిల్లికి తగిన పిల్లి!" అని ఎంతో సంబర పడింది.

"ఈ పిల్లిని తెచ్చినవాడు ఇతనే!" అంటూ మంత్రి చంద్రావతికి జయంతుణ్ణి చూపించాడు.

"నిజంగా నాకు తగినవాడే!" అని చంద్రావతి మనసులోనే అనుకుని, అతన్ని పెళ్ళి చేసుకుంటావా అని తండ్రి అడిగి నప్పుడు, చేసుకుంటానని ఉత్సాహంగా తల ఎగరేసింది.

మంత్రి చేసిన యుక్తి మూలంగా చంద్రా వతి కోరికా, జయచంద్రుడి కోరికా కూడా సిద్ధించాయి.

జయంతుడికీ చంద్రావతికీ మహా వైభ వంగా వివాహం జరిగింది.





# భేషజం

ఒక చిన్న గ్రామంలో అనంతాచారి అనే వైద్యు డుండేవాడు. ఆయన వైద్యంలో ప్రవీణుడైనా కాకపోయినా, ఒక్కందుకు గొప్పఖ్యాతి సంపాదించుకుని, చుట్టుపక్కల అనేకమైళ్ళ దూరం నుంచి జనాన్ని ఆకర్షించటం మొదలుపెట్టాడు. ఆయనకు అంత ఖ్యాతి తెచ్చిన విషయ మేమిటంటే— గర్భిణీ స్త్రీల నాడి పరీక్షించి ఆయన, గర్భంలో ఉన్న శిశువు ఆడదయినదీ, మగదయినదీ సరిగా చెప్పేవాడు.

అనంతాచారి కీర్తి పెరిగినకొద్దీ వందల కొద్దీ గర్భిణీస్త్రీలు వచ్చి, ఆయన చేత నాడీ పరీక్ష చేయించుకుని, తమకు ఏ బిడ్డ పుట్టేదీ తెలుసుకుని వెళ్లిపోయేవారు ఏ రోజు ఎవరు తనను చూడవచ్చినదీ, వారికి తానేమి చెప్పినదీ ఒక పుస్తకంలో వివరాలతో తేదీలవారిగా రాసి ఉంచుకునేవాడు అనంతాచారి.

పరీక్ష చేయించుకున్న వాళ్లు ఇంత ఇవ్వాలన్న నియమం అనంతాచారి ఏర్పాటు చేయలేదు. వచ్చే వాళ్ళు ఉత్తచేతులతో రాకుండా తమ శక్తికొద్దీ ఏదో కొంత ఇచ్చి పోయేవాళ్ళు. బీదవాళ్ళు సైతం కూరో, పండో ఇచ్చేవాళ్ళు. ఆయన చెప్పిన విధంగా బిడ్డలను కన్నవాళ్ళు బారసాలలు చేసుకునేటప్పు డాయనను పిలిచి బట్టలు పెట్టటమూ, ధనికులైతే కట్నాలు చదివించటమూ కూడా జరిగేది.

అనంతాచారి చెప్పిన ప్రకారం జరగటం లేదని అక్కడక్కడా పుకార్లు బయలుదేరినప్పుడు అనుమానం కలిగి ఆయనను నిలవదీసి ఎవరన్నా అడిగితే, ఆయన తన పుస్తకం తీసి చూపి, వాళ్ళ అనుమానాలకు ఆధారం లేదని రుజువు చేసేవాడు.

ఇలా కొంతకాలం జరిగాక అనంతాచారి భార్య గర్భంధరించింది. చాలాకాలంగా

జి. చిరంజీవి

పిల్లలులేని అనంతాచారి ఎంతో సంతో షించాడు.

"మన కడుపునకూడా ఒక నలుసు పుట్టబోతున్నది గనక, అది పిల్లో, పిల్లాడో నా నాడి చూసి చెప్పెయ్యండి," అన్నది అనంతాచారి భార్య.

"ఏదయితేనేం? మనకు సంతానం కలగటమే పదివేలు!" అన్నాడు అనంతాచారి చిరునవ్వునవ్వుతూ.

"అలా అంటారేమిటి? ప్రపంచంలో అందరికీ చెబుతూ మనకు పుట్టబోయే బిడ్డ గురించి మనకు తెలియదంటే ఎంత అవమానం!" అన్నది భార్య.

అనంతాచారి భార్య చెయ్యి తీసుకుని జాగ్రత్తగా నాడి పరీక్షించాడు గాని చాలా సేపు ఏమీ అనలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? చెప్పండి త్వరగా!" అన్నది భార్య.

"ఏం చెప్పమన్నావు? చెప్పకున్నా అవమానమే. నీకు పుట్టబోయేది ఆడపిల్ల," అన్నాడు అనంతాచారి. ఆడపిల్లలను కనటం అదృష్టహీనమని తన భార్యకు నమ్మకం ఉన్నట్టు అనంతాచారికి తెలుసు. ఆయన ఎవరికన్నా ఆడపిల్ల పుట్టుతుందని చెప్పినప్పుడు ఆమె వారిని గురించి చాలా తేలిక భావం ప్రకటించేది.



తాను కనబోయేది ఆడపిల్ల అని అంద రికీ చెప్పటానికి అనంతాచారి భార్యకు నిజం గానే నామోషీ. అందుచేత ఎవరన్నా అమ్మలక్కలు, "నీకేంపిల్ల పుట్టబో తున్నది?" అని అడిగితే, "ఏమో, నేను చెయ్యి చూపించుకోలేదు," అంటూ వచ్చింది.

తీరా తొమ్మిదిమాసాలు మోసి ఆమె పండంటి మగబిడ్డను కన్నది.

అనంతాచారి గుండెల్లో రాయిపడింది. ఇలా అయిందేమంటే తాను తన భార్య కేం చెప్పాలో ఆయనకు తోచలేదు.

ఆమె అడగనే అడిగింది! "ఎక్క డెక్కడివాళ్ళకూ పుట్టబోయే బిడ్డ ఫలానా అని సరిగా చెప్పారుగదా, నాకు చెప్పొచ్చే టప్పటికి మీ తెలివి తలకిందులయిందేం?"

అనంతాచారి పిచ్చిమొహంవేసి, "నాడి చూసి నేను పుట్టబోయేబిడ్డ సంగతి నిజంగా చెప్పగల ననుకుంటున్నావా?" అన్నాడు.

"అయితే మరి మీకింత పేరెలావచ్చిందీ? అందరూ మీరు చెప్పినట్టే జరిగిందంటు న్నారే?" అన్నది భార్య.

"మోసం చేశాను. ప్రజలు అజ్ఞానులు. నా దగ్గిరికి వచ్చినవాళ్ళకు నోటికొచ్చినట్టు ఆడపిల్ల అనో, మగపిల్లవాడనో చెప్పాను. వాళ్ళు వెళ్ళగానే నా పుస్తకంలో తేదీవేసి, వాళ్ళపేర్లు రాసి, నేను చెప్పినదానికి విరు ద్ధంగా రాసిపెట్టాను. నా నోటిమాట నిజ మైతే, పేచీయేలేదు. నిజంకాకుండా పోయి నప్పుడు వాళ్ళు వచ్చి అడిగినా, వాళ్ళ తరఫున ఇంకోరు వచ్చి అడిగినా పుస్తకం తీసి నేను రాసుకున్నది చూపాను. తామే తప్పుగా జ్ఞాపకంపెట్టుకున్నట్టు వాళ్ళు అను కుని నా నాడీపరీక్షలో మరింత గురిగా ఉండేవాళ్ళు. ప్రజల మూఢత్వం కాకపోతే, పుట్టబోయే శిశువు ఆడా, మగా అనేది చెప్పగల వైద్యుడు సృష్టిలో ఉన్నాడా?" అన్నాడు అనంతాచారి.





# దొంగ కాని దొంగ

ఒక గ్రామంలో ఒక గృహస్థుకు చాలా మంది పిల్లలు ఉండేవారు. వారిలో పెద్ద వాడు గోవిందుడు ఏమాత్రమూ చురుకుతనం గాని, గడుసుతనం గాని లేనివాడు. మిగిలిన పిల్లలందరూ తండ్రి చేసే పనులకు ఏదో విధంగా సహయ పడేవాళ్ళు, గోవిందుడే ఏ పనీ చెయ్యలేక పోయేవాడు. చూసి చూసి, ప్రాణం విసిగి, "నువు తిండికి దండీ, పనికి మొండీ! నీ వల్ల ఒక్క పని కూడా కాదు. ఏం పుటక పుట్టావు!" అని నానా మాటలూ అన్నాడు తండ్రి.

తండ్రి తిట్టినందుకు గోవిందుడికి అభిమానం వచ్చింది. వాడు తన గొంగళి తీసుకుని, ఇంటి నుంచి బయలుదేరాడు.

ఫలాని చోటికి అనుకోకుండా కాళ్ళు తీసుకుపోయినట్టు నడిచి, చీకటి పడేసరికి వాడొక అరణ్యం మధ్య చిక్కుకున్నాడు. ఆ రాత్రి వాడు అరణ్యంలోనే గడపవలిసి వచ్చింది. పడుకునే చోటు కోసం వాడు చుట్టూ చూస్తూండగా ఒక మహావృక్షం మానులో ఒక పెద్ద తొర్ర కనబడింది. గోవిందుడు ఆ తొర్రలోకి ఎక్కి, గొంగళి కప్పుకుని, వెచ్చగా నిద్రపోయాడు.

ఒక రాత్రి వేళ ఏదో అలికిడి అయి వాడికి నిద్రాభంగమయింది. వాడు మెల్లిగా గొంగళిని తన ముఖం మీది నుంచి తొలగించి బయటికి చూశాడు. వాడు పడుకున్న చెట్టుకు ఎదురుగానే ఇద్దరు దొంగలు చిన్న బుడ్డి దీపం వెలుగులో, తాము తస్కరించిన నగలను చూసుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఒక దొంగ ఒక వజ్రాలహారాన్ని పైకెత్తి, "మిగిలిన వన్నీ ఒక ఎత్తూ, ఈ హారం ఒక ఎత్తూనూ. దీన్ని కాజెయ్యటానికి నా నేర్పంతా వినియోగించాను. రాజకుమార్తెను నిద్ర చెడకుండా ఎంతో ఉపా

వి. సీతారామయ్య




యుంగా తియ్యవలిసి వచ్చింది. అదృష్టం బాగుంది. ఆమె లేవలేదు," అన్నాడు.

వాళ్ళ సంభాషణనుబట్టి వాళ్ళు ఆ నగలన్నిటినీ రాజభవనం నుంచి దొంగిలించినట్టు గోవిందుడు తెలుసుకున్నాడు. నగలన్నీ ఎంతో అందంగా ఉన్నాయి.

వాడా దొంగలనూ, నగలనూ తన్మయత్వంతో చూస్తూండగా, చల్లగాలికి తుమ్ము వచ్చింది. ఆపుకోలేక గోవిందుడు రెండు తుమ్ములు తుమ్మాడు. దొంగలు భయంగా చెట్టు తొఱ్ఱ కేసి చూశారు. అందులో వాళ్ళకు నల్లని కంబళీ తప్ప ఇంకేమీ కనిపించలేదు.



"అమ్మయ్యో, ఎలుగ్గొడ్డు!" అని వాళ్ళిద్దరూ తమ నగల మూటను అక్కడే వదిలి, పారిపోయారు.

గోవిందుడు చెట్టుతొఱ్ఱలో నుంచి దిగి వచ్చి, దొంగలు వదిలిపోయిన నగలను మూటగట్టి, "ఈ నగలు పోయినందుకు, పాపం, రాజుగారు ఎంత బాధపడుతూ ఉంటారో! వీటిని వారికి తిరిగి అప్పగించేద్దాం," అనుకుని బయులుదేరాడు. వాడు కొంతదూరం నడిచాక తెల్లవారింది. దారి తెలుసుకుంటూ కొంత పొద్దెక్కేసరికి వాడు రాచనగరు చేరుకుని, ద్వారపాలకుడితో, "నేను రాజుగార్ని చూడాలి," అన్నాడు.

ద్వారపాలకుడు వాణ్ణి ఎగా దిగా చూసి, "నీకు రాజుగారితో ఏంపని?" అని అడిగాడు.

"రాజుగారింట దొంగతనం జరిగిన సొమ్ము తెచ్చాను. దాన్ని వారికి తిరిగి ఇవ్వాలి," అన్నాడు గోవిందుడు.

ద్వారపాలకుడు అటుగా వచ్చిన మరొక భటుణ్ణి తన స్థానంలో కొంచెంసేపు ఉండమని చెప్పి, గోవిందుణ్ణి తన వెంట తన యింటికి తీసుకుపోయి, "రాజుగారు వేటకు వెళ్ళారు. హాయిగా భోజనం చేసి విశ్రాంతి తీసుకో. తరవాత నిన్ను రాజుగారి దగ్గిరికి తీసుకుపోతాను," అన్నాడు.



అమాయకుడైన గోవిందుడు వాడి మాట నమ్మి, వాడిచ్చిన మత్తు భోజనం తిని, ఒళ్ళు తెలియకుండా పడిపోయాడు. ద్వార పాలకుడు వాడి మూట తీసి దాచిపెట్టి, వాణ్ణి ఒక నిర్జన ప్రదేశంలో పెట్టేశాడు.

సూర్యాస్తమయం వేళకు గోవిందుడు మేలుకున్నాడు. వాడు నీరసంగా లేచి, కొంతదూరం నడిచి ఒక ముసలమ్మ ఉండే గుడిసె చేరుకుని, ఒళ్ళంతా మంట లెత్తు తూండటం చేత దాహం అడిగాడు. ముస లమ్మ వాడికి మంచి నీళ్ళిచ్చి, వాడి కథంతా విని, "మంచి బుద్ధి గల వాడివి. నీ తండ్రి నిన్నెందు కట్లా తిట్టిపొయ్యాలి? నా దగ్గిర ఉండిపో, బాబూ. నా మనమడి వనుకుంటాను," అన్నది.

ఆ రాత్రి ద్వారపాలకుడు ఇంటికి చేరే లోపలనే వాడి భార్య మూటలోని నగలన్నీ తీసి చూసి, మహా ముచ్చటపడింది. వాటిలో నుంచి వజ్రాలహారం తీసుకుని మెడలో కూడా వేసుకున్నది. ద్వారపాలకుడు ఇంటికి వస్తూనే తన భార్య మెడలో హారం చూసి, "కొంపముంచావు! ఆ నగలన్నీ రాజుగా రింటివి. ఆ హారం వేసుకుని ఎవరికన్నా కనిపించావంటే నీ పీకా, నా పీకా కూడా తెగిపోతాయి!" అన్నాడు.




"లేదు, లేదు! ఇంట్లోనే వేసుకుం టాను," అన్నది భార్య.

ఆమె ఆ రాత్రల్లా దాన్ని తన మెడలోనే ఉండనిచ్చి, మర్నాడు ఉదయం తలంటుకో బోతూ, తీసి ఒక చోట పెట్టింది. కొంచెం సేపయాక ఆమె కొడుకు మూడేళ్ళవాడు రొట్టె పట్టుకుని వచ్చాడు. ఆ హారాన్ని చూసి దాన్ని కూడా రొట్టెతోబాటే చేతిలోకి తీసుకుని వసారాలోకి పోయాడు.

ఇంతలో ఎక్కడి నుంచో ఒక కాకి వచ్చి వాడి చేతిలో ఉన్న రొట్టెనూ, అందులో చిక్కుకున్న హారాన్నీ కూడా తన్నుకు పోయింది. అది తిన్నగా వచ్చి, సమీపం

లోనే ఉన్న ముసలిదాని గుడిసె మీద వాలింది. గుడిసె బయట నిలబడి ఉన్న గోవిందుడు కాకి ముక్కున ఏదో నగ వేళ్ళాడుతూండటం చూశాడు. వాడు కాకి తిరిగి ఎగిరిపోయినదాకా ఆగి, ఇంటి కప్పు కెక్కితే హారం కనిపించింది. అది రాజుగారు పోగొట్టుకున్న నగలలో హారమే!

దాన్ని తీసుకుని వాడు మళ్ళి రాజభవనాన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. ద్వారం వద్ద నిన్నటి మనిషే ఉన్నాడు. గోవిందుడు దాన్ని తీసి ద్వారపాలకుడికి చూపిస్తూ, "రాజుగారు నిన్న వేటకు వెళ్ళారన్నావు. నేను తెచ్చిన మూట రాజుగారి కిచ్చే ఉంటావు. కాని ఆ మూటలోని ఈ హారం చూడు! కాకి ఎత్తుకొచ్చింది. ఇది రాజుగారి కింకా చేరలేదు," అన్నాడు.

ద్వారపాలకుడు దిగ్భ్రాంతుడై, మరు క్షణం యుక్తిగా, "దొంగ! దొంగ!" అని అరిచి గోవిందుణ్ణి పట్టుకున్నాడు. రాజభటులు మూగారు. "వీడే రాజుగారింట దొంగతనం చేసినది. ఇదుగో వజ్రాల హారం!" అన్నాడు ద్వారపాలకుడు.

రాజభటులు గోవిందుణ్ణి పెడరెక్కలు విరిచికట్టి రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

గోవిందుడు జరిగినదంతా రాజుగారికి పూసగుచ్చినట్టు చెప్పాడు. రాజుగారికి ద్వారపాలకుడి మోసం స్ఫురించింది. ఆయన వెంటనే వాడి ఇంటికి భటులను పంపి, ఇల్లు సోదా చేయించగా, రాజుగారి ఇంట పోయిన మిగిలిన నగలన్నీ దొరికాయి.

రాజుగారు ద్వారపాలకుడికి తగిన శిక్ష ఇచ్చి, గోవిందుడికి మంచి బహుమానం ఇచ్చి, తన కొలువులో పెట్టుకున్నాడు. గోవిందుడు తనకు వచ్చిన బహుమానాన్ని ముసలమ్మకు ఇచ్చేశాడు. ముసలమ్మ మంచి ఇల్లు ఏర్పాటు చేసుకుని, గోవిందుణ్ణి తల్లి కన్న ఎక్కువగా చూస్తూ, తాను జీవించినంత కాలమూ సాకింది.





# ఆదర్శముఖుడు

పూర్వం ఆదర్శముఖు డనే దొడ్డ రాజుండే వాడు. న్యాయపరిపాలనకు ఆయనకు పెట్టినది పేరు.

ఆయన రాజ్యంలో దూరప్రాంతాన దండి అనే బ్రాహ్మడు ఉండేవాడు. ఈ దండి ఒకనాడు తన పొలం దున్నుకునేటందు కని ఒక ఆసామీని అడిగి ఒక జత ఎడ్లు తీసుకుపోయి, తన పని పూర్తికాగానే వాటిని ఆసామీ వద్దకు తిరిగి తెచ్చాడు. ఆసామీ భోజనం చెయ్యబోతూ తన ఎడ్లను చూశాడు. ఆయనను బాధించటం దేనికని, దండి ఆ ఎడ్లను తానే పశువుల కొట్టంలోకి తోలి, ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆసామీ భోజనం చేసి వచ్చి చూస్తే పశువులకొట్టంలో ఎడ్లు లేవు. అవి ఎటో వెళ్ళిపోయాయి. ఆయన ఆందోళనగా దండిని కలుసుకుని "నా ఎడ్లు ఎక్కడ?" అని అడిగాడు.

"మీ కొట్టంలో లేవా? వాటిని అందులోకి తోలానే?" అన్నాడు దండి.

"ఏమో, నా కదంతా తెలియదు. నా ఎడ్లను నాకు తిరిగి ఇచ్చెయ్యి," అన్నాడు ఆసామీ.

"నేను ఎడ్లను తీసుకురావటం నువ్వూ చూశావు. నేనేం దొంగతనం చేశానా? కావలిస్తే మా యింటికి వచ్చి చూసుకో," అన్నాడు దండి.

"మీ ఇంటికి వచ్చి చూసే పని నాది కాదు. నా ఎడ్లను తీసుకుపోయావు. వాటిని తెచ్చి నాకు అప్పగించే పూచీ నీదే. లేదంటావా, రాజుగారి వద్ద నీ మీద ఫిర్యాదు తెస్తాను," అన్నాడు ఆసామీ.

చేసేదిలేక దండి ఆ ఆసామీ వెంట రాజు గారి వద్దకు బయలుదేరాడు. దారిలో నది వచ్చింది. ఒక వడ్రంగి తన గొడ్డలిని నోట కరుచుకుని నది ఈదుతూ వస్తున్నాడు.

ఎ. సూర్యనారాయణ

"నది బాగా లోతున్నదా ఏం?" అని దండి వడ్రంగిని అడిగాడు.

"అబ్బే, శానాలోతు," అన్నాడు వడ్రంగి. అతను నోరు తెరిచి జవాబు చెప్పేసరి కల్లా నోటిలో పట్టుకున్న గొడ్డలి కాస్తా నీటిలో పడి మునిగిపోయింది.

"నీ మూలంగా నా గొడ్డలి పోయింది. నా కింకో గొడ్డలి తెచ్చి ఇయ్యి," అన్నాడు దండితో వడ్రంగి, ఒడ్డుకువచ్చి.

"నే నేం చేశాను? నువే నోరు తెరిచి గొడ్డలి పోగొట్టుకున్నావు," అన్నాడు దండి.

"నీ మూలాన గాదూ నేను నోరు తెరిచిందీ? నా గొడ్డలి నా కిస్తావా? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చెయ్యమన్నావా?" అన్నాడు వడ్రంగి.

"మేం రాజుగారి దగ్గిరికే పోతున్నాం. నువు కూడా మా వెంటరా!" అన్నాడు ఆసామీ వడ్రంగితో. ముగ్గురూ కలిసి కొంత దూరం నడిచారు. వారి కొక గొల్లవాడు కని పించాడు. చెట్లకింద మేకలు మేస్తున్నాయి.

"అవతల అంత మంచి మేతబీళ్ళుంటే నీ మేకలు ఈ చెట్ల కింద మేస్తున్నాయేం?" అని దండి ఆ గొల్లవాణ్ణి అడిగాడు.

"ఏమో, బాబూ. అవి ఇక్కడ తప్ప మెయ్యవు. కారణమేమిటో రాజుగారికి తెలియాలిసిందే," అన్నాడు గొల్లవాడు.



"సరే నేను రాజుగారిని అడిగి తెలుసుకుంటాలే," అన్నాడు దండి.

మరి కొంత దూరం వెళ్ళాక ఇంకో చోట ఒక పుట్ట వద్ద ఒక మనిషి కనపడ్డాడు.

"పుట్ట వంక అంత దీక్షగా చూస్తున్నావేం?" అని ఆ మనిషిని అడిగాడు దండి.

"ఏమీలేదు. ఈ పుట్టలో నుంచి ఇంతకు మునుపు ఒక పాము సరసరా బయటికి వచ్చింది. కొంచెం సేపయాక అది మళ్ళీ పుట్టలో ప్రవేశించింది. కాని లోపలికి పోవటం దానికి చాలా బాధ అయినట్టు కనపడింది. అది ఒక్కొక్క అంగుళమే కదులుతూ, ఆగుతూ లోపలికి పోయింది. ఎంత అలోచించినా కారణం కనబడలేదు," అన్నాడా మనిషి.

"ఇదేదో రాజుగారు చెప్పవలిసిందే," అన్నాడు దండి.

తరవాత వాళ్ళు రాజుగారి వద్దకు వెళ్లారు.

అదర్శముఖ మహారాజు ఆసామీ తెచ్చిన ఫిర్యాదు విని, "ఈ బ్రాహ్మడు ఎద్దులను తీసుకు రావటం నువు చూసి కూడా వాటిని భద్రంగా కట్టేసుకోలేదు. అందుచేత నీ కళ్లు పొడిపిస్తాను. వాటిని కొట్టంలోకి తోలుతున్నట్టు నీకు చెప్పనందుకు ఈ బ్రాహ్మడి నాలుక కోయిస్తాను. సమ్మతమేనా?" అన్నాడు ఆసామీతో.



"వద్దు, మహారాజా! నా ఎడ్లను నే నే వెతుక్కుంటాను. నా ఫిర్యాదు ఉపసంహరించుకో నివ్వండి," అన్నాడు ఆసామీ.

తరవాత రాజు వడ్రంగి తెచ్చిన ఫిర్యాదు విని, "నోట్లో గొడ్డలి ఉండగా నోరు తెరిచి మాట్లాడటం నీ తప్పు. అందుకు నీ నాలుక కోయిస్తాను. నువు ఈదుతూ ఉండటం చూసి కూడా నది లోతున్నదా అని అడగటం ఈ బ్రాహ్మడి తప్పు. అందుకు ఇతని కళ్ళు పొడిపించేస్తాను. సమ్మతమేనా?" అన్నాడు వడ్రంగితో. వడ్రంగి కూడా భయపడి ఫిర్యాదు ఉపసంహరించుకున్నాడు.

తరవాత దండి రాజును, "మహారాజా, అడవిలో ఒకచోట చెట్లకింద కొన్ని మేకలు మేస్తున్నాయి. అంతకన్న మంచి మేత దొరికే స్థలాలు చుట్టుపక్కన ఉన్నా కూడా అవి ఆ చోటు వదిలి పోవటం లేదు. వాటిని కాసే గొల్లవాడు కారణం ఊహించలేకుండా ఉన్నాడు," అని అడిగాడు.

"ఆ చెట్ల మీద తేనెపట్టు లున్నాయి. వాటి నుంచి కింద తేనెబొట్లు పడటం చేత మేకలు అక్కడే మేస్తున్నాయి. త్వరలోనే ఆ తేనెపట్లను కొట్టేయిస్తున్నాము. అప్పుడు మేకలు మంచి మేతగల చోటికి పోతాయి," అన్నాడు రాజు.

"మరొక చిన్న వింత. ఒక పుట్టలో ఒక పామున్నది. అది పుట్టలో నుంచి చాలా వేగంగా బయటికి వస్తుంది. కాని పుట్టలోకి తిరిగి పోయేటప్పుడు చాలా ప్రయాసపడుతుంది. కారణ మేమై ఉంటుంది?" అన్నాడు దండి.

"అది ఆకలితో బయటికి వస్తుంది. కడుపు ఉబ్బేటట్టు తినటం చేత కలుగులోకి దూరటం దానికి కష్టమవుతుంది," అన్నాడు రాజు.

తరవాత దండీ, ఆసామీ, వడ్రంగీ రాజుగారి సూక్ష్మబుద్ధిని కొనియాడి, రాజు వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు.






# తీరని జంటు సమస్య

ఒక ఊళ్ళో ధనికుడొకడుండేవాడు. అతను గొప్ప పిసినారి. ఇంటిపనీ, బయటిపనీ బోలెడంత ఉండేది. కనీసం ఇద్దరు మనుషులకు తీరిక లేనంత పని. కాని ఆ ధనికుడు ఇంటిపని అంతా తన కూతురి చేతనే చేయించేవాడు. బయటి పనికి గాను ఎవరినన్నా పెట్టేవాడే గాని వాడి చేత గొడ్డుచాకిరీ చేయించటమే గాక, జీతం సరిగా ఇచ్చేవాడు కాడు. నెల కాగానే జీతండబ్బులడిగితే, "తిండి పెడుతూనే ఉంటినిగదా. జీతం డబ్బులతో ఏం అవసరం వచ్చింది? మింగేస్తానా? నువు వెళ్ళేటప్పుడు పెద్ద మొత్తంగా తీసుకుపోవచ్చుగా!" అనేవాడు.

అయన వద్ద పనివాళ్ళు ఉండేవాళ్ళు కాదు. కొందరు ఆ వెట్టిచాకిరీకి భయపడి వెళ్ళిపోయేవారు. కొందరు రెండు, మూడు నెలల జీతం పోగయాక, డబ్బు తీసుకుని వెళ్ళిపోయేవారు.

ఇలా ఉండగా ఆ ధనికుడి వద్ద పని చెయ్యడానికి గంగన్న అనేవాడు కుదిరాడు. వాడు మంచి బలశాలి. ఎంత బరువు పని అయినా నిర్లక్ష్యంగా చేసేస్తాడు. వాడికి తల్లీ, తండ్రీ, అన్నలూ, తమ్ముళ్ళూ ఎవరూ లేరు. పెళ్ళి కూడా కాలేదు. ఒక రోజల్లా వాడు చేసిన పని చూశాక ధనికుడు చాలా తృప్తి పడ్డాడు.

"ఒరే గంగన్నా, నీ కెవరూ లేరంటున్నావు గనక, నా దగ్గిరే ఉండిపో. నీకు తిండీ, గుడ్డా ఇచ్చి, నెలకు పదిరూపాయలిస్తాను," అన్నాడు యజమాని.

అందుకు గంగన్న ఒప్పుకున్నాడు. వాడు నెలరోజులూ పనిచేసి, జీతం అడిగాడు. ఆ సమయానికి ఊళ్ళో పెద్దలతో మాట్లాడుతున్న యజమాని, "జీతం అడగడానికి వేళా, పాళా లేదుట్రా? కాకపోయినా జీతం ఇస్తే ఏం చేస్తావు? నీ అవసరాలన్నీ నేను

సి. రామేశం

గడుపుతూనే ఉంటిని. నీ పెళ్ళి అయేదాకా డబ్బు నా దగ్గిరే ఉండనీ. అప్పుడు మొత్తంగా డబ్బు చేతికి వస్తే ఎందుకైనా ఉపయోగపడుతుంది," అన్నాడు. "ఏమంటారు ?" అని ఆయన తనతో మాట్లాడే పెద్దల నడిగితే, వాళ్లు బాగుందన్నారు.

పెద్దల ఎదట యజమాని మాట ఇచ్చాడు గదా అని గంగన్న సరే నన్నాడు. ఆ ఇంట తనొక్కడే నౌకరు కాదని గంగన్నకు తెలిసివచ్చింది. యజమాని తన కూతురు గిరిజ చేత కూడా ఇంటెడు చాకిరీ చేయిస్తాడు. ఆమెకు క్షణం తీరిక ఉండదు. సూర్యుడి కన్న ముందే లేచిన గిరిజ రాత్రి ఝామున్నర పొద్దుపోయాక గాని నడుమువాల్చదు. పెళ్ళి చేసేస్తే ఇంత పనీ చెయ్యటానికి ఇద్దరు మనుషులనైనా పెట్టాలిసొస్తుందన్న దుర్బుద్ధితో యజమాని ఆమె పెళ్ళి ప్రయత్నాలేమీ చెయ్యటం లేదు.

గంగన్న తనకు అవకాశం దొరికినప్పుడల్లా ఇంటిపనిలో సహాయపడుతూ క్రమంగా గిరిజ ప్రేమకు పాత్రుడయాడు. గిరిజను చూసి గంగన్న జాలిపడితే, గంగన్నను చూసి గిరిజ జాలిపడేది. ఈ జాలి ప్రేమగా మారటానికి ఎంతో కాలం పట్టలేదు. ఏ తెల్లవారుఝామునో ఇద్దరూ కలుసుకుని తమ కష్టసుఖాలు చెప్పుకునే వారు.



"చూడు, గంగన్నా. నీ జీతండబ్బు మా నాన్న దగ్గిర పేరుకుపోతున్నది. అది నువు కళ్ళచూడటం చాలా కష్టం. మా నాన్న ప్రాణమైనా ఇస్తాడు గాని, చూస్తూ చూస్తూ డబ్బివ్వడు. మనిద్దరమూ పెళ్ళి అయితేనే కాని ఈ చెర నుంచి బయట పడలేం. నాకు ఎలాగూ మోక్షం లేదు. నువ్వయినా పెళ్ళి చేసుకుంటున్నానని చెప్పి, నీ డబ్బు నువు తీసుకుని, బయట పడు," అన్నది గిరిజ.

"సంబంధం కూడా వెతుక్కోలేదే, ఎవరిని పెళ్ళాడతానని చెప్పను?" అన్నాడు గంగన్న.

"ఆ వివరాలన్నీ మా నాన్నకు చెప్పాలా యెట్లా? డబ్బు తీసుకుని వీధిలో పడ్డావంటే ఏ పిల్లయినా నిన్ను కళ్ళకద్దుకుని పెళ్ళాడు తుంది. నీకేం? నిక్షేపంలాటి వాడివి!" అన్నది గిరిజ.

"అంతే నంటావా? అయితే యజమానితో మాట్లాడి చూస్తాను," అన్నాడు గంగన్న.

యజమాని మళ్ళీ ఊళ్ళో పెద్దలతో మాట్లాడుతూండగా గంగన్న ఆయన వద్దకు వెళ్ళి, "బాబూ, నేను వచ్చి పదిమాసా లయింది. నాకు లగ్గం కుదిరింది. జీతం డబ్బు లిప్పిస్తారా? ఎంచి నూరురూపా



యులే ఇచ్చేరు. కాస్త తూతూమేళానికీ, తాళి ఖర్చులకూ పైనేమైనా వేసి మరీ ఇవ్వండి," అన్నాడు.

ఎద్దు లాగా ఎంత పనైనా చెయ్యగల నౌకరు చెయ్యిజారి పోతున్నాడని లోపల దుఃఖంగా ఉన్నా, పైకి నవ్వి, "ఓరి వెధవా! మూడో కంటివాడికి తెలియకుండా పెళ్ళి నిశ్చయం చేసుకున్నావా? కొంచెం ఉండు. వీరిని పంపేసి, నీ డబ్బు నీ కిస్తాను," అన్నాడు యజమాని.

తరవాత ఆయన డబ్బుసంచీ తీసి రూపాయలు ఎంచి, అయిదేసి చొప్పున చాప మీద బొత్తులు పెడుతూ, "ఇంతకూ పిల్ల ఎవర్రా? ఎప్పుడు మాటలు జరిగాయి? ఎప్పుడు పెళ్ళిచూపు లయాయి? ఏమిటి కథ?" అన్నాడు.

"రోజూ ఉన్న పెళ్ళిచూపులే గదండీ? పెళ్ళికూతురు మీ అమ్మాయే!" అన్నాడు గంగన్న.

ఒక్క క్షణం యజమాని కొయ్యబారి పోయాడు. మరుక్షణం కూతుర్ని కేకేసి, "అమ్మాయ్, నువు ఈ గంగన్నను చేసుకుంటానన్నావా?" అన్నాడు.

"అనలేదుగాని, నీ కభ్యంతరం లేకపోతే చేసుకుంటాను, నాన్నా!" అన్నది గిరిజ.

యజమాని ముఖానికి క్రమంగా వెలుగు వచ్చింది. ఆయన తన రూపాయలను మళ్ళీ సంచీలో పోసుకుంటూ, "నా కెందుకు అభ్యంతరం? ఇప్పుడే సిద్ధాంతిగారిని పిలిపించి ముహూర్తం పెట్టిస్తాను," అన్నాడు.

అంతే జరిగింది. మరుసటి నెలలో గంగన్నకూ, గిరిజకూ పెళ్ళి అయింది. ఇంటి నౌకరు కాస్తా, జీతం బత్తెం లేని ఇంటి అల్లుడయాడు. ఇప్పటి కింకా గిరిజ ఇంటి పని అంతా చేస్తూనే ఉన్నది, గంగన్న బయటి పని అంతా చేస్తూనే ఉన్నాడు.

అయినా వాళ్ళకు జీవితం ఇప్పుడే బాగున్నది.





# రేవన్న

శామలాపురం నుంచి రామవరం వెళ్ళే రహదారి మీద అనేక అగ్రహారా లున్నాయి. అందులో కూనపల్లి అనే ఒక చిన్న అగ్రహారంలో రేవన్న అనే పేదబ్రాహ్మడు ఒకడుండేవాడు.

ఒక రోజు సాయంత్రం రేవన్న ఒక చక్కని కబురు విన్నాడు. మర్నాడు ఉదయం శామలాపుర జమీందారుగారు పెద్ద సంతర్పణ చేస్తున్నారట.

అతను మర్నాడు చాలా పెందలాడే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, "ఎట్లాగైనా, ప్రభువంటే శామలాపురం జమీందారే ప్రభువు. అంత ధనికుడు చుట్టుపట్ల పన్నెండు ఆమడలో మరొకడు లేడు. సంతర్పణ చేస్తే అటువంటివాడు చెయ్యాలి, నాబోటివాడు తినాలి," అనుకుంటూ రేవన్న తూర్పుముఖమై శామలాపురం కేసి పరమానందంతో నడిచాడు.

అతను నాలుగుమైళ్ళు నడిచి దప్పికల పాడు చేరేసరికి కొందరు బ్రాహ్మలు ఎదురు వస్తూ కనిపించారు.

"శామలాపురం జమీందారుగా రింట గొప్పగా సంతర్పణ సాగుతుంటే మీ రంతా ఎదురుప్రయాణ మయారేమిటి?" అని రేవన్న వాళ్ళను అడిగాడు.

"నీకు తెలియదా ఏం? రామవరం జమీందారుగారింట వారి కుమార్తె పెళ్ళి. మంచి సంభావనలు కూడా ఇస్తారు. భోజనం మాట అడగే అక్కర్లేదు," అన్నారు వాళ్ళు కాలుసాగించి నడుస్తూ.

రేవన్న వాళ్ళ వెంట బయలుదేరాడు. ఈసారి అతను తన గ్రామం కూడా దాటి రెండుమైళ్ళు నడిచాక అతని కొక బ్రాహ్మల తండా ఎదురయింది.

"మీ రంతా సంభావనలకు రామవరం వెళ్ళటంలేదూ?" అన్నాడు రేవన్న వాళ్ళతో.

పి. మాధవశర్మ

"సంభావన మాటకొస్తే శామలాపురం జమీందారు దక్షిణ ఇచ్చినంత సంభావన కూడా రామవరం ఆయన ఇవ్వలేడు. ఇక సంతర్పణంటావా? అడగకు! బండీడు పనసకాయలు వచ్చాయట. రామవరంలో ఇచ్చే దొడ్డ సంభావనపాటి చెయ్యకపోదు పనసకాయకూర!" అంటూ ఆ బ్రాహ్మణ తండా తూర్పుగా సాగిపోయింది.

"వెనక్కి తిరగటం పొరపాటయింది. ఝాం పొద్దెక్కింది. ఈ పాటికి శామలా పురం చేరే పని. నా మొహానికి సంభావన ఎవరు ఘనంగా ఇస్తారు? మంచి భోజనం పోగొట్టుకోవటం కూడని పని," అనుకుని రేవన్న, సాధ్యమైనంత వేగంగా, మళ్ళీ శామలాపురం దారి పట్టాడు.

అతను సగం దూరం నడిచేసరికే సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. మరో గంట నడిచేసరికి, బొర్రలు నిమురుకుంటూ బ్రాహ్మణులు కబుర్లు చెప్పుకుంటూ అతనికి ఎదురుపడి, "ఎక్కడికి పోతున్నావు? శామలాపురంలో సంతర్పణ అయిపోయింది. ఏమి పనసకాయకూర! ఏం పాయసం! దివ్యమైన భోజనం!" అన్నారు.

రేవన్నకు బుర్ర తిరిగిపోయింది. అతను రామవరం చేరుకోవాలని వెనక్కి తిరిగాడు.

అతను తన గ్రామాన్ని చేరుకునేసరికి రామవరం నుంచి గ్రామస్థులు తిరిగి వచ్చి, "నువు శామలాపురం వెళ్ళావు గామాలు! రామవరంలో ఎంత బాగా జరిగిందనుకున్నావు. పెద్ద జమీందారు కాడేమోగాని, చెయ్యి మహాపెద్దది," అన్నారు.

"అక్కడ ఇంకా భోజనాలు సాగుతున్నాయా?" అని రేవన్న అడిగాడు.

"మాదే ఆఖరు పంక్తి. ఈ పాటికి హరికథకు ఏర్పాట్లు జరుగుతూ ఉంటాయి," అన్నారు ఊరిబ్రాహ్మలు.

రేవన్న సంగతి దాగలేదు. "రెంటికీ చెడిన రేవడు," అన్నారు ఊళ్ళోవాళ్ళు.





# యుక్తివిజయం

మలేయదేశం లోని మలక్కా రాజ్యాన్ని సుల్తాన్ ముజఫర్‌షా పాలించేవాడు. ఒకప్పుడు ఊరూ పేరూ లేని మలక్కా గ్రామం ముజఫర్‌షా పరిపాలించే నాటికి శక్తివంతమైన మహా నగరంగా తయారై, సర్వసంపదలతోనూ తులతూగుతున్నది. ఇది చూసి సయామువేశస్థులకు కన్ను కుట్టింది. భూమార్గాన సయామీయులు మలక్కాపై దాడి చేయటం సాధ్యం కాదు. ఎందుకంటే మధ్యలో దుర్భేద్యమైన కీకారణ్యాలున్నాయి. సయాము సేనలు ఆ అరణ్యాలకుండా ప్రయాణం చేస్తే, ఒక్కడు కూడా తిరిగి ప్రాణాలతో వెనక్కు రాడు.

అందుచేత సయామీయులు యుద్ధనావలలో మలక్కా పైకి దాడి వెడలారు. మలక్కాకు నిత్యమూ దేశాంతరాల నుంచి వస్తూ పోతూ ఉండే వర్తక నౌకలవాళ్ళు, మలయా యుద్ధనావలు తూర్పు తీరాన్ని చుట్టి, పడమటి తీరాన ఉన్న మలక్కా కేసి వస్తూ ఉండటం చూసి, రాజును హెచ్చరించారు.

యుద్ధనావలు తెడ్లతో నింపాదిగా నడుస్తాయి గనకా, అవి చుట్టు తిరిగి వస్తూ ఉండటం వల్లా, ముజఫర్‌షా యుద్ధ యత్నాలు చెయ్యటానికి తగినంత వ్యవధి ఉండింది. సయామీయులు మలయా తీరాన్ని సమీపిస్తూనే మలక్కా సేనల చేత చావు దెబ్బతిని, వెనక్కు తిరిగి పోయారు. త్వరగా పారిపోగలందులకు వాళ్ళు తమ యుద్ధ పరికరాలన్నిటినీ సముద్రంలోకి తోసేశారట!

అయినా సయామీయులు అంతటితో అగక ఇలాటి దండయాత్రలు చాలాసార్లు చేశారు. కాని ప్రతిసారీ వాళ్ళు అపజయమే పొందారు. చివరకు వారు తమ పథకాన్ని మార్పు చేసుకున్నారు. ఈసారి వాళ్లు రాత్రి

హెచ్. లక్ష్మినారాయణ

వేళ మలేయా ద్వీపకల్పం తూర్పు తీరాన్ని దాటి తెల్లవారేసరికల్లా సింగపూరు చేరి పడమటి తీరాన్ని అందుకున్నారు.

అప్పటికి గాని దాడి సమాచారం మలక్కాకు అందలేదు. మలక్కా రాజు కంగారు పడ్డాడు. భారీఎత్తున సైన్యాన్ని ఆయత్త పరిచే వ్యవధి లేదు. రాత్రి మొదటి ఝాము కల్లా శత్రునావలు చేరుకుంటాయి. ఆయన తన ప్రధాని అయిన బేందహర అనేవాణ్ణీ, సేనాని అయిన విజధీరజ అనేవాణ్ణీ పిలిచి వా రిద్దరితోనూ సంప్రతించాడు.

సేనాని వెంటనే తన చిన్న కొడుకును పిలిచి, "నువు తెప్ప వేసుకుని తీరం వెంబడి వెళ్ళి, మన మీదికి వచ్చే శత్రు నావలు ఎన్ని ఉన్నదీ తెలుసుకురా," అన్నాడు. ఆ కుర్రవాడు తెప్పను నడుపు కుంటూ చురుకుగా శత్రునావలకు ఎదురు వెళ్ళి, వాటి మధ్యగా సంచరిస్తూ అన్నిటినీ లెక్క పెట్టి తిరిగి వచ్చాడు.

సయామీయుల నావల సంఖ్య చాలా ఉన్నది. అన్ని నావలనూ రాత్రిలోపల ఆయత్తం చెయ్యటం సేనాపతికి సాధ్యం కాదు. ఏం చెయ్యాలి?

"మిగతా పని నేను చూస్తాను," అన్నాడు ముఖ్యమంత్రి. ఆయన సేనాపతిని వెంట బెట్టుకుని తన పడవలో బటూ పహట్ అనే తీర ప్రాంతానికి చేరుకున్నాడు. ఆ తీరాన సముద్రాన్ని ఆనుకుని లక్షల కొద్దీ "మాంగ్రోవ్" చెట్లున్నాయి.

"ఈ చెట్లన్నిటికీ ఒక మైలు నిడివిన దివిటీలు కట్టించుదాం," అన్నాడు ప్రధాని.

అలాగే చేశారు. ఆ రాత్రికి సయామీయులు ఆ తీరాన్ని చేరవస్తూ లక్షల కొద్దీ దివిటీలనూ, సముద్రజలంలో వాటి ప్రతి బింబాలనూ చూశారు. వారికి గుండెలు అవిసి పోయాయి. అవన్నీ నావలే ననుకుని, వాళ్లు యుద్ధప్రయత్నం మాని, తమ దేశానికి అతి శీఘ్రంగా తిరిగిపోయారు.





# తగిన వరుడు

ప్రభాకరనగరపు రాజుకు నడివయస్సులో ఒక కుమార్తె కలిగింది. ఆ పిల్ల పేరు ప్రియంవద. ఆమె యుక్తవయస్కురాలయే సరికి తండ్రికి వృద్ధాప్యం రానే వచ్చేసింది. తన కూతురి పెళ్ళి చూడకుండా కన్ను మూయవలిసి వస్తుందేమోనని రాజుకు బెంగ పట్టుకుంది.

"అమ్మా, నీ పెళ్ళి కోసం నాకు చాలా తొందరగా ఉన్నది," అన్నాడు రాజు ప్రియంవదతో.

"బాగానే ఉంది. కాని నేను ఎవరినని పెళ్ళాడను?" అన్నది కూతురు.

"నిన్ను పెళ్ళాడేవాడు నీకు నచ్చాలి ముందు. ఆ తరవాత అతను నా రాజ్యాన్ని న్యాయంగా పాలించగలవాడై ఉండాలి. మన ఇద్దరికీ నచ్చేటట్టుగా చూడాలంటే ఒక పని చేద్దాం. యోగ్యులైన రాజకుమారులలో నీకు నచ్చిన వాళ్ళెవరో చెప్పు. వాళ్లను పిలిపించి ఒక పరీక్ష పెడతాను. అందులో నెగ్గినవాడు నీకూ, నాకూ నచ్చినవాడవుతాడు. ఏమంటావు?" అన్నాడు రాజు.

ఇందుకు ప్రియంవద ఒప్పుకున్నది. ఆమె ముగ్గురు రాజకుమారులను ఎన్నుకున్నది. వారిలో ఏ ఒకడూ అతడి తండ్రి సింహాసనాన్ని ఆక్రమించేవాడు కాడు. అందుచేత ప్రభాకరనగరానికి ఏలిక కావటానికి వారిలో ఏ ఒకడికీ అభ్యంతరం ఉండదు.

రాజు ఆ ముగ్గురు రాజకుమారులకూ ఆహ్వానాలు పంపి పిలిపించాడు. ముగ్గురూ అందచందాలలో ప్రియంవదకు తగిన వాళ్ళే. ముగ్గురూ బుద్ధికౌశలమూ, ప్రియభాషిత్వమూ కలవారే.

"కుమారులారా, మా అమ్మాయి ప్రియంవదాదేవి స్వయంవరం నిమిత్తం మిమ్మల్ని ఆహ్వానించాను. మీలో ఆమె ఎవరిని ఎన్ను

ఎస్. ముత్యాలరావు.



కునేదీ తేల్చుకునే లోపల మీరు ముగ్గురూ బయలుదేరి వెళ్ళి, సరిగా ఒక్క మాసం లోపల ఆమెకు తగిన కానుకలు తీసుకు రావాలి. ఇవాళ పూర్ణిమ. వచ్చే పూర్ణిమ నాటికి మీరు మళ్ళీ వచ్చేయండి," అన్నాడు రాజు వారితో.

ముగ్గురు రాజకుమారులూ బయలుదేరి వెళ్ళిపోయారు.

నెల ఇట్టే తిరిగి, మళ్ళీ పౌర్ణమి రోజు వచ్చేసింది.

రత్నపురి రాజకుమారుడు రత్నకేతుడు ఒక తోలు సంచీ నిండా వెల లేని రత్నాలు తెచ్చి చూపి, "ఇందులో వజ్రాలూ, వైడూర్యాలూ, కెంపులూ, నీలాలూ, పచ్చలూ, గోమేధికాలూ — అన్ని రకాలూ ఉన్నాయి. వీటితో రాజకుమార్తెకు ఒక అందమైన కిరీటమూ, రత్నాలహారమూ చేయిస్తాను," అన్నాడు రాజుతో.

అయోధ్య రాజకుమారుడు శూరజిత వర్మ తుపాకీ ఒకటి తెచ్చాడు.

"ఇది పశ్చిమఖండం నుంచి వచ్చింది. దీన్ని మించిన మారణాయుధం మరి లేదు. దీని ముందు బాణాలూ, గదలూ, ఈటెలూ, శక్తులూ, గండ్రగొడ్డళ్ళూ ఎందుకూ పనికిరావు. ఇది మనకు ప్రపంచాన్నంతా జయించిపెడుతుంది," అన్నాడు శూరజిత వర్మ రాజుతో.

మూడోవాడు సువ్రతదేశ రాజకుమారుడు గుణనిధి ఏమీ తీసుకురాలేదు. రాజు తన కేసి చూసినప్పుడు, "క్షమించండి. నేను కానుక లేమీ తీసుకురాలేదు. వాటిని గురించి ఆలోచించడానికే నాకు తీరిక లేక పోయింది. నిన్న రాత్రి చంద్రుణ్ణి చూసినప్పుడు గాని నాకు పూర్ణిమ దగ్గిరపడిన సంగతి కూడా గుర్తుకు రాలేదు," అన్నాడు.

"అంత తీరని పనిలో ఎలా మునిగిపోయావు? ఏం జరిగింది?" అని రాజు అడిగాడు.

"నేను బయలు దేరిన రెండో రోజున నాకు బాధితుల గుంపొకటి ఎదురయింది. అందులో హెచ్చుమంది స్త్రీలూ, పిల్లలూనూ. వాళ్ళు చేసే ఆర్తనాదాలు విని, ఏం జరిగిందని అడిగాను. వాళ్ళ నగరం మీద పిండారీలు వచ్చి పడ్డారట. అనేక మంది పురుషులను చంపారట. ఇళ్ళన్నీ కొల్లగొట్టారట. కొద్దిమంది పురుషులు మిగిలారు గాని, వారు ధైర్యం కోల్పోయి ఉన్నారు. నేను వారందరినీ కూడదీసి, ధైర్యం చెప్పి వాళ్ళ నగరానికి తీసుకుపోయాను. దారిలో అనేక గ్రామాలవాళ్ళు ఆయుధాలతో సహా వచ్చి మాతో కలిశారు. అందరమూ కలిసి బందిపోటుతో హోరాహోరి, గంటలతరబడి యుద్ధం చేశాం. పారిపోయిన కొద్దిమంది తప్పిస్తే దొంగలంతా చచ్చారు. అనాథలైన స్త్రీలకూ, పిల్లలకూ తిరిగి ఆశ్రయాలు ఏర్పాటు చేసి, వారి జీవితాలను తిరిగి ఒక మార్గంలో పెట్టటానికి చాలా కాలం పట్టింది. కూలిపోయిన ఇళ్ళు కట్టవలసి వచ్చింది. చచ్చిపోయిన వారికి అంత్యక్రియలు చెయ్యవలసివచ్చింది. ఈ గొడవలో నాకు రాజకుమార్తెకు తేవలిసిన కానుక మాట జ్ఞాపకమే లేకపోయింది," అన్నాడు గుణనిధి.

ఇది విన్న రాజు కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయి.

అతను తన కుమార్తె చేతిని గుణనిధి చేతిలో పెట్టి, "నాయనా, నీ వంటివాడు రాజైతే నా రాజ్యం నాలుగు కాలాలపాటు సుభిక్షంగా ఉంటుంది. నీలాటివాడు స్త్రీ వ్యామోహంలో పడి, ప్రజల కష్టసుఖాలను విస్మరించడు. ప్రియంవదకు నీవే తగిన భర్తవు. మీ కిద్దరికీ వెంటనే పెళ్ళి చేసేస్తాను," అన్నాడు.

ప్రియంవద వరమాల తెచ్చి గుణనిధి మెడలో వేసింది. ఆ రోజే వారికి వైభవంగా వివాహం జరిగిపోయింది.



# నాస్తికుడి కల

ఒక గ్రామంలో ఒక నాస్తికు డుండేవాడు. అతనికి జబ్బు చేసి కింద పెట్టేదాకా వచ్చింది. అతని బంధువులు పురోహితుడికి కబురు పంపారు. పురోహితుడు వచ్చాడు.

"అయ్యా, నేను చచ్చిపోతున్న మాట నిజమే గాని నాకు ఉత్తమలోకాలలో నమ్మకం లేదు. అందుచేత తమరు నాకు ఉత్తరక్రియలు చేయించ నవసరం లేదు. నన్ను నిశ్చింతగా చావనివ్వండి," అన్నాడు నాస్తికుడు.

"నీకు నరకమే గతి!" అని శపించి పురోహితుడు వెళ్ళిపోయాడు.

ఇంతకూ నాస్తికుడు చావ లేదు. అతని రోగం దానంతట అదే తిరుగుముఖం పట్టింది.

పురోహితుడు అతన్ని చూడ వచ్చి, "బతికి బయట పడ్డావన్న మాట," అన్నాడు.

"లేదండీ. చచ్చిపోయాను. యమదూతలు నన్ను యముడి దగ్గిరికి తీసుకుపోయారు. 'నీకు ఉత్తరక్రియలు జరగలేదా?' అని యముడు అడిగాడు. 'లేదండీ. అంతగా అవసరమైతే పురోహితుణ్ణి పిలిపించి ఇప్పుడు జరిపించండి,' అన్నాను. 'అలా కుదరదు. పురోహితు లందర్నీ నరకంలో నూనెకాగుల్లో కాస్తున్నాం. నువు మరి కొన్ని రోజులు బతికి మళ్ళీ రా!' అన్నాడు యముడు. వచ్చేశాను!" అన్నాడు నాస్తికుడు.






నైమిశారణ్యంలో ఋషిగణా లుండేవి. ఆ ఋషులకు కులపతి శౌనకమహాముని. ఆయన ఒకప్పుడు పన్నెండేళ్ళ పాటు జరిగే సత్రయాగం చేశాడు. అనేకమంది మహాఋషులు కలిసి ఆ యాగం చేస్తూండగా అక్కడికి రోమహర్షుడి కొడుకు ఉగ్రశ్రవసు డనే సూతుడు వచ్చాడు. సూతుడికి తెలియని పురాణగాథలు లేవు.

సూతుణ్ణి చూడగానే మునులందరూ అతని చుట్టూ మూగి, "నువు ఎక్కడి నుంచి వస్తున్నావు? నువు రావటం మా కెంతో సంతోషమయింది. నీ నుంచి మేము ఎన్నో పుణ్య కథలు వినవచ్చు," అన్నారు.

సూతుడు వారితో, "మహర్షులారా, పరీక్షితుడి కొడుకు జనమేజయుడు సర్పయాగం చేశాడు. ఆ సమయంలో వైశంపాయనుడు జనమేజయుడికి భారతకథలను చెప్పాడు. ఆ కథలను రాసినవాడు వైశంపాయనుడి గురువైన వేదవ్యాసుడే. నేనా కథలన్నీ విని, అనేక తీర్థాలు సేవించి, కౌరవ పాండవులు యుద్ధం చేసిన శమంతకపంచకమనే పుణ్యక్షేత్రానికి వెళ్ళి, అటు నుంచి ఇలా వచ్చాను," అన్నాడు

ఇంకేముందీ? వ్యాసుడు రచించిన భారతకథలను తమకు చెప్పమని సూతుణ్ణి శౌనకాది మహామునులు కోరారు.

సూతుడు వారితో ఇలా చెప్పాడు: భారతరచన ఎలా జరిగిందనుకున్నారు? కృష్ణద్వైపాయను డనే పేరుగల వ్యాసుడు వేదాలను నాలుగుగా విభజించిన అనంతరం

1. పరీక్షిత్తు శాపం



హిమాలయాల మీద తపస్సు చేశాడు. ధృతరాష్ట్రుడితరం వారంతా చనిపోయాక భారతం ఆలోచించాడు. అది లోకానికంతకూ పఠనీయంగా ఉండేటట్టు చేసే మార్గ మేమిటా అని ఆలోచిస్తూండగా ఆయనను చూడటానికి బ్రహ్మ వచ్చాడు. వ్యాసుడు బ్రహ్మకు ప్రణామం చేసి, కూర్చోబెట్టి, "దేవా, నేను వేదవేదాంగాల సారమంతా ఇమిడ్చి, భారతమనే ఇతిహాసాన్ని రచించాను. ప్రజలు దాన్ని చదివి ఆనందించేటట్టుగా లిఖించే వాడెవడూ కనబడడు," అన్నాడు.

"నాయనా, విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించి, అతని ద్వారా నీ భారత ఇతిహాసాన్ని



రాయించు," అని బ్రహ్మ వ్యాసుడికి సలహా ఇచ్చాడు.

వ్యాసుడు ధ్యానించగా విఘ్నేశ్వరుడు వచ్చాడు. వ్యాసుడు కోరిన ప్రకారం, ఆయన చెబుతూ ఉంటే విఘ్నేశ్వరుడు మహాభారతాన్ని లిఖించాడు. దాన్ని దేవలోకంలో నారదుడూ, పిత్రులోకంలో దేవలు డనే అసితుడూ, గంధర్వాది లోకాలలో శుకుడూ ప్రచారం చేశారు. జనమేజయుడు సర్పయాగం చేసినప్పుడు వైశంపాయనుడు దానినే పఠించి, భూలోకంలో ప్రచారంలోకి తెచ్చాడు.

శౌనకాది మునులు ఈ విషయాలు విని సంతోషించి, "కౌరవపాండవులు యుద్ధం చేసిన శమంతకపంచకం అనే క్షేత్రానికి ఆ పేరు ఎలా వచ్చింది?" అని సూతుణ్ణి అడిగారు.

సూతుడు వారికి ఇలా చెప్పాడు:

త్రేతా ద్వాపరయుగ సంధిలో రాజులు మదించి, అధర్మమార్గాన సంచరిస్తూ ఉంటే పరశురాముడు వారిని ఇరవైఒక్క సారి వెతికి వెతికి చంపి, వారి రక్తంతో అయిదు మడుగులు కల్పించి, ఆ మడుగులలో పితృదేవతలకు తర్పణా లిచ్చాడు. పితృదేవతలు, ఆ మడుగులైదూ పుణ్యతీర్థ





ఘయేటట్టు పరశురాముడికి వరమిచ్చారు. ఆ ప్రదేశంలోనే అతి ఘోరమైన భారత యుద్ధం జరిగింది. ఆ కారణంగా శమంతక పంచకక్షేత్రానికి కురుక్షేత్ర మనే పేరు వచ్చింది.

పరీక్షితుడి కొడుకైన జనమేజయుడు ఆ కురుక్షేత్రంలో, తన తమ్ములైన శ్రుతసేన, ఉగ్రసేన, భీమసేనుల సహాయంతో దీర్ఘమైన సత్రయాగం చేశాడు. ఆ సమయంలో, సరమ అనే దేవతాశునకం కొడుకు సారమేయం అనేది యజ్ఞవాటికలో తిరుగుతూంటే, జనమేజయుడి తమ్ములు ఆ కుక్కను కొట్టారు. అది వెళ్ళి తన తల్లి అయిన సరమతో చెప్పింది. "సాధువులూ, పేదలూ అయిన వారికి కీడుచేస్తే కట్టికుడపకపోదు," అని సరమ తిట్టింది.

సరమ తిట్టు శాపమై తగులుతుందేమోనని భయపడి జనమేజయుడు హస్తినాపురానికి తిరిగి వచ్చి, శాంతికర్మలు చేయించటానికి పురోహితు డెవడైనా దొరుకుతాడా అని చూడసాగాడు. ఒకసారి అతను అరణ్యంలో వేటాడబోగా, అక్కడ శ్రుతశ్రవుడి ఆశ్రమం కనబడింది. శ్రుతశ్రవుడికి సోమశ్రవు డనే కొడుకున్నట్టు తెలిసి, జనమేజయుడు, "మీ కుమారుణ్ణి నాకు పురోహితుడుగా ఇవ్వగలరా?" అని శ్రుతశ్రవుణ్ణి అడిగాడు.

"నా కొడుకుకు ఒక నియమమున్నది. బ్రాహ్మణుడైనవాడు ఏది అడిగినా నా కొడుకు ఇచ్చేస్తాడు. అతని ఈ నియమానికి భంగం రాకుండా నువు చూసే పక్షంలో, అతను నీకు పురోహితుడుగా ఉంటాడు," అన్నాడు శ్రుతశ్రవుడు. జనమేజయుడు అందుకు సమ్మతించి, సోమశ్రవుణ్ణి హస్తినాపురానికి తీసుకుపోయి, అతని సహాయంతో అనేక యజ్ఞాలు చేశాడు.

ఇలా ఉండగా ఒకనాడు జనమేజయుడి వద్దకు ఉదంకు డనే మహర్షి వచ్చి, "రాజా,



చెయ్యవలసిన పని ఉపేక్షించి, చేతులు కట్టుకు కూర్చున్నావేమిటి?" అన్నాడు.

"స్వామీ, క్షత్రియ ధర్మాలన్నీ తప్పకుండా అచరిస్తున్నానే? ఏమిటి నేను చెయ్యక మానినది?" అని జనమేజయుడు ఉదంకుణ్ణి అడిగాడు.

"సర్పయాగం చెయ్యి! ఆ దుర్మార్గుడు తక్షకుణ్ణి బూడిద చెయ్యి. మీ తండ్రి అయిన పరీక్షిత్తును కాటు వేసి చంపింది ఆ తక్షకుడుకాడూ? మీ తండ్రి ప్రాణాలను రక్షించటానికి వచ్చే కాశ్యపుడికి అంతులేని ధనాన్ని లంచం పెట్టి, తిప్పి పంపేసినదీ వాడేగా?" అన్నాడు ఉదంకుడు.



నిజానికి ఉదంకుడికి కూడా తక్షకుడి పైన పగ ఉన్నది. దానికి కారణం ఇది:

ఈ ఉదంకుడు వేదు డనే ఋషి దగ్గిర చదువుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించబోతూ, తన గురువును గురుదక్షిణ ఏమి ఇవ్వ మంటారని అడిగాడు. "నా భార్య ఏమి కోరుతుందో అడిగి చూడు," అన్నాడు వేదుడు. ఉదంకుడు గురుపత్నిని ఏమి కావాలని అడిగాడు.

"ఇవాళకు నాలుగో రోజున నేను పుణ్యకవ్రతం చేసుకుంటాను. అప్పుడు కుండలాలు పెట్టుకోవాలని ఉన్నది. నేను కోరే కుండలాలు పౌష్యు డనే రాజు భార్య వద్ద ఉన్నాయి. చాతనయితే వాటిని తెచ్చి ఇయ్యి," అన్నది గురుపత్ని.

ఉదంకుడు పౌష్యరాజు భార్య వద్దకు పోయి సంగతి చెప్పాడు. ఆమె తన కుండలాలు ఇవ్వటానికి ఒప్పుకున్నది, కాని వాటిని తస్కరించటానికి తక్షకుడు ఎల్లప్పుడూ ఎదురు చూస్తున్నాడని హెచ్చరించింది.

ఆమె అన్నట్టే జరిగింది. ఉదంకుడు ఆ కుండలాలు తీసుకుని అరణ్య మార్గాన పోతూ, ఒక చోట మడుగు చూసి, కుండలాలను ఒక చోట పెట్టి, ఆచమించటానికి మడుగు దగ్గిరికి పోయేసరికి, అప్పటిదాకా



ఉదంకుణ్ణి దూరదూరంగా వెన్నాడుతూ వచ్చిన తక్షకుడు ఆ కుండలాలను హరించి పారిపోసాగాడు. నగ్నమానవ రూపంలో ఉన్న తక్షకుణ్ణి ఉదంకుడు తరిమి పట్టుకున్నాడు. వెంటనే తక్షకుడు పాముగా మారి ఒక బిలంలో దూరాడు.

ఉదంకుడు ఆ బిలాన్ని ఒక కర్రతో తవ్వి పెద్దదిచేస్తూ, ఆ మార్గాన పాతాళానికి చేరుకున్నాడు. అక్కడ ఉన్న నాగులను ఉదంకుడు ఎంత స్తోత్రం చేసినా లాభం లేకపోయింది. చివరకు అతనికి ఒక గుర్రం మీద కూర్చుని ఉన్న ఒక మనిషి కనిపించాడు. ఆ గుర్రం అగ్ని, దాని మీద ఉన్నవాడు ఇంద్రుడు. ఆ సంగతి ఉదంకుడికి తెలియదు. అయినా, ఆ మనిషి తనను, "నీకేం కావాలి?" అని అడిగితే, ఉదంకుడు నాగలోకాన్ని తనకు అధీనం చెయ్యమన్నాడు. వెంటనే ఆ గుర్రం నుంచి భయంకరమైన అగ్ని జ్వాలలు వెలువడ్డాయి. నాగలోకమంతా బూడిద అయిపోతుందని భయపడి, తక్షకుడు కుండలాలను తెచ్చి ఉదంకుడికిచ్చాడు. అతను వాటిని సకాలంలో గురుపత్నికి అందజేశాడు.

ఉదంకుడి ద్వారా తన తండ్రిని చంపినది తక్షకుడని తెలియగానే జనమేజయుడు



తన మంత్రులను, "అలా జరగటానికి కారణమేమిటి?" అని అడిగాడు. వాళ్ళు పరీక్షిత్తు మరణవృత్తాంతం ఇలా చెప్పారు:

భారత యుద్ధంలో చనిపోయిన అభిమన్యుడికీ, ఉత్తరకూ పుట్టిన పరీక్షిత్తు కృపాచార్యుడి వద్ద విలువిద్య నేర్చి, పాండవుల అనంతరం రాజ్యపాలన చేస్తూ వచ్చాడు. ఆయనకు వేట అంటే చాలా ఇష్టం. ఒకనాడాయన వేట తమకంలో అరణ్యంలో తన చేత దెబ్బతిని పారిపోయే జంతువును తరుముకుంటూ, శమీకు డనే మహాముని తపస్సు చేసుకుంటున్న చోటికి వచ్చి, "బాణంతగిలిన మృగం ఇటుగా



పరిగెత్తుకుంటూ వచ్చింది. అది ఎటుగా పోయింది?" అని అడిగాడు.

మౌనంగా తపస్సు చేసుకునే శమీకుడు సమాధానం చెప్పలేదు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది. అతను ఒక చచ్చిన పామును బాణం ములికితో ఎత్తి శమీకుడి మెడలో వేసి వెళ్ళిపోయాడు. శమీకుడి కొడుకైన శృంగికి ఒక మిత్రుడి ద్వారా పరీక్షిత్తు చేసిన పని గురించి తెలిసింది. ముక్కోపి అయిన శృంగి, "ఇవాళకు ఏడోరోజున పరీక్షిత్తు తక్షకుడి విషంతో చచ్చిపోవుగాక!" అని శాపం ఇచ్చాడు.

తన కొడుకు పరీక్షిత్తులాటి మంచి రాజుకు ఇంత దారుణమైన శాపం ఇచ్చాడని తెలిసి శమీకుడు చాలా నొచ్చుకుని, గౌరముఖుడనే తన శిష్యుణ్ణి పిలిచి, "నువు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, శాపం సంగతిచెప్పి, తక్షకుడి వల్ల అపాయం రాకుండా జాగ్రత్త పడమని చెప్పు," అన్నాడు. గౌరముఖుడు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, గురువుగారు చెప్పమన్నట్టే చెప్పాడు.

పరీక్షిత్తు తాను చేసిన పనికి నొచ్చుకుని, శృంగి ఇచ్చిన శాపానికి భయపడి, శాపం తగలకుండా ఏదైనా ఉపాయం చూడమని మంత్రులను కోరాడు. వాళ్ళు ఒక ఒంటి



స్తంభం మేడ కట్టించారు. అందులోకి బయటి గాలి కూడా పోవటానికి లేదు. మేడ నిండా విషాలకు విరుగుడుగా పనిచేసే ఔషధాలను ఉంచారు. విషవైద్యులనూ, మంత్రసిద్ధులనూ పిలిపించారు. రాజుతో సహా మంత్రులందరూ ఆ మేడలోనే చేరారు.

ఆరు రోజులు ఏ ప్రమాదమూ లేకుండా గడిచాయి. ఏడో రోజున కాశ్యపు డనే బ్రాహ్మణుడు, పరీక్షిత్తుకు కలిగిన శాపం గురించి విని, తక్షకుడు కరిచిన పక్షంలో రాజు ప్రాణాలను కాపాడటానికి బయలుదేరి వస్తున్నాడు. తక్షకుడు కూడా రాజును కరవటానికి మార్గమేదా అని ఆలోచిస్తూ,

బ్రాహ్మణ వేషంలో వస్తూ కాశ్యపుణ్ణి కలుసుకుని, అతను వెళ్ళే పని తెలుసుకున్నాడు.

కాశ్యపుడు తక్షకుడితో, "నాకు పాముల విషానికి విరుగుడు తెలుసును. నా మంత్ర శక్తితో, పాములచేత చచ్చినవారిని బతికించగలను. రాజును తక్షకుడు కరిచే పక్షంలో ఆయనను బతికించితే, నాకు బోలెడంత ధనమూ, కీర్తీ కూడా లభిస్తుంది," అన్నాడు.

"అయ్యా, నేనే తక్షకుణ్ణి. నా విషంతో చచ్చినవారు బూడిద అయిపోతారు. నీ మంత్రాలతో తిరిగి బతకరు. నువు తిరిగి వెళ్ళు," అన్నాడు తక్షకుడు.

కాశ్యపుడు ఒప్పుకో లేదు. తక్షకుడు సమీపంలో ఉన్న మర్రిచెట్టును కాటువేసి, తన విషాగ్నితో దాన్ని బూడిద చేసేశాడు. వెంటనే కాశ్యపుడు తన మంత్రంతో దాన్ని ఎప్పటిలాగా చేశాడు.

"నా విషానికి విరుగుడు వెయ్యగలవేమోగాని, శాపానికి విరుగుడు వెయ్యగలవా? రాజు ఇచ్చే ధనం కంటె చాలా హెచ్చు ధన మిస్తాను. వెళ్ళిపో," అని తక్షకుడు కాశ్యపుణ్ణి లోభ పెట్టి, డబ్బిచ్చి పంపేశాడు.

తరవాత తక్షకుడు కొందరు నాగులను మునికుమారుల రూపంలో పరీక్షిత్తు వద్దకు పంపాడు. వాళ్ళు ఫలాలూ, పుష్పాలతో పరీక్షిత్తు వద్దకు వెళ్ళారు. వాళ్ళిచ్చిన ఫలాలలో ఒకదాన్ని పరీక్షిత్తు పగల దీశాడు. అందులో ఒక చిన్న పురుగు కనబడింది.

పరీక్షిత్తు తన చుట్టూ ఉన్నవారితో, "శాపకాలం ముగుస్తున్నది. సూర్యాస్తమయం కావస్తున్నది. నన్ను కరిస్తే ఈ పురుగు కరవాలిగాని, సర్ప భయం లేదు," అన్నాడు. అంతలోనే ఆ పురుగు తక్షకుడై పరీక్షిత్తును కరిచాడు. అందరూ చెల్లా చెదరుగా పారిపోయారు. తక్షకుడి కాటుకు పరీక్షిత్తు తగలబడి పోవటమేగాక, ఒంటి స్తంభం మేడ నిలువునా మండింది!





# గాంధీ కథ

గుజరాతురాష్ట్రం చాలా ప్రసిద్ధి గలది. కృష్ణుడు నివాసం ఏర్పరచుకున్న ద్వారక అక్కడే ఉన్నది. సోమనాథ దేవాలయం కూడా అక్కడే ఉన్నది. ఈ రెండూ ప్రఖ్యాత యాత్రాస్థలాలు. గుజరాతీల పైన బుద్ధుడి బోధల ప్రభావమూ, మహావీరుడి బోధల ప్రభావమూ బలంగా ఉన్నది. వల్లభాచార్యుల ఉపదేశాలూ, మీరాబాయి భజనలూ వారికి బాగా పరిచితమైనవి. హిందూమత సంస్కర్త అయిన స్వామీ దయానందుడు కూడా అక్కడివాడే. పాకిస్థాను నిర్మాణానికి మూలపురుషుడైన జిన్నా కూడా గుజరాతీయుడే. ఇద్దరూ గాంధీకి సమకాలికులే.

గుజరాతులో కఠియవాడ్ అన్నది ఒక ప్రాంతం. బ్రిటిషువారి పరిపాలనలో, వారి పరిరక్షణ కింద, కఠియవాడ్‌లో సుమారు 300 సంస్థానాలుండేవి. అందులో పోర్‌బందర్ సంస్థానం ఒకటి. 18 వ శతాబ్దంలో జూనాగడ్ సంస్థానం నుంచి పోర్‌బందర్‌కు హరజీవన్ గాంధీ అనే వైశ్యుడు వలస వచ్చి, 1777 లో ఒక ఇల్లు కొనుక్కుని, తన కొడుకులతో కలిసి చిల్లర వ్యాపారాలు సాగించాడు. హరజీవన్ కొడుకులలో ఉత్తమచంద్ అనే అతను పోర్బందర్ పాలకుడైన రాణా ఖీమాజీ ప్రశంసకు పాత్రుడై, దివానుగా నియమించబడ్డాడు. ఈ విధంగా గాంధీల కుటుంబం ప్రసిద్ధికి వచ్చింది.

పరిపాలనా నిర్వహణలో ఉత్తమచంద్ సమర్థుడై, సంస్థానాన్ని రాజకీయంగానూ, ఆర్థికంగానూ దెబ్బ తినకుండా కాపాడాడు. అయితే ఖీమాజీ అల్పాయుష్కుడు కావటం చేత, రాజ్యపాలన అతని తల్లి చేతిలోకి వచ్చింది. దివాను యొక్క దక్షత గాని, స్వతంత్ర భావాలు గాని ఆమెకు పట్టలేదు.



రాణీగారి దాసీలు ఆడించినట్టు ఆడని ఒక ఉద్యోగికి ఉత్తమచంద్ రక్షణ ఇచ్చి, రాణీగారి ఆగ్రహానికి పాత్రుడయాడు. ఆగ్రహావేశంలో రాణీగారు తన ముఖ్య దివాను ఇంటి మీదికి సైనిక దళాన్ని పంపి, కాల్పులు జరిపించింది. (ఆ తుపాకీ గుళ్ల గుర్తులు చాలా కాలం అలాగే నిలిచి ఉన్నాయి.) అదృష్టవశాన ఈ వార్త అక్కడి బ్రిటిష్ ఏజెంటుకు తెలిసి, కాల్పులు ఆపు చేయించాడు.

ఇది జరిగిన మీదట ఉత్తమచంద్ పోర్బందర్ విడిచి పెట్టి, జూనాగఢ్ లోని తమ స్వగ్రామానికి తిరిగి పోయి, జూనాగఢ్ నవాబు ఆదరణతో ఆయనకు దివానుగా కుదిరాడు. పోర్బందర్‌లో రాణీగారి పెత్తనం ముగిసి, రాణా విక్రమజిత్ గద్దె ఎక్కాక 1847 లో ఉత్తమచంద్ గాంధీకి తిరిగి దివాను పదవి ఇస్తామన్నారు. ఉత్తమచంద్ నిరాకరించగా ఆ పదవి అతని కొడుకైన కరంచంద్‌కు ఇవ్వబడింది.

ఇరవైఅయిదేళ్ళ వయసులో పోర్బందర్ దివాన్ గిరీ చేపట్టిన కరంచంద్, నీతీ నిజాయితీలతో 28 ఏళ్ళపాటు ఆ పని నిర్వహించిన మీదట, పాలకుడి అనాదరానికి గురి అయి, తన పదవిని తన తమ్ముడైన తులసీదాసు కిచ్చి, తాను రాజకోట చేరి, అక్కడి పాలకుడి ఆశ్రయం కింద దివానుగా చేరాడు.

కరంచంద్ ఈ పదవిలో ఉండగా బ్రిటిషు అధికారి ఆయనను అరెస్టు చేశాడు. దానికి కారణ మేమంటే, ఒక బ్రిటిషు అధికారి రాజకోట పాలకుణ్ణి అగౌరవంగా మాట్లాడి నందుకు కరంచంద్ ఆయనను గట్టిగా మందలించి, క్షమాపణ ఇవ్వ నిరాకరించాడు. కరంచంద్ సాహసాన్ని చూసి, ఆయనను అరెస్టు చేసిన అధికారి నిర్ఘాంత పోయి, ఎందుకైనా మంచిదని వదిలి పెట్టేశాడు.



కరంచంద్ గాంధీకి నలుగురు భార్యలు. ఒక భార్య పోగా ఆయన మరొక భార్యను చేసుకున్నాడు. ఆయన నాలుగో భార్య పుతలీబాయి ఆయన కన్న దాదాపు 20 ఏళ్ళు చిన్నది. ఆమెకు ముగ్గురు కొడుకులూ, ఒక కూతురూ జన్మించారు. ఆమె కన్న కొడుకులలో ఆఖరువాడు మోహన్‌దాస్ గాంధీ.

గాంధీమహాత్ముడని ప్రపంచ ఖ్యాతి పొందిన ఈ మోహన్‌దాస్, నూరేళ్ళ క్రితం, 1869 అక్టోబరు 2న జన్మించాడు.

మోహన్‌దాస్ పుట్టినది పోర్బందర్‌లోని గాంధీల మూడంతస్తుల భవనంలోనే. అతను ఏడేళ్ళు వచ్చేదాకా అక్కడే తన పెత్తండ్రుల కుటుంబ బలగం మధ్య పెరిగి, అటు తరవాత రాజకోట చేరాడు. రాజకోట సముద్రతీరం కాదు గాని, రాజకీయంగానూ, సాంఘికంగానూ పోర్బందర్ లాగా బొత్తిగా వెనకబడిన చోటు కూడా కాదు. పోర్బందర్‌లో గాంధీ చదివిన చదువు మట్టిలో వేళ్ళతో అక్షరాలు రాయటం మాత్రమే. రాజకోటలో ఏకంగా హైస్కూలు వుండేది.



గాంధీ తల్లి పుతలీబాయి నిర్వాహకురాలు. ఆమె రాజకుటుంబ స్త్రీలతో సంబంధాలు గలిగి, రాజకీయ విషయాలపై తన ప్రభావం చూపగలిగి ఉండేది. కాని ఆమె గృహ బాధ్యతలను అశ్రద్ధ చేసేది కాదు, ఆమె జీవితమంతా ఉపవాసాలతోనూ, మొక్కులతోనూ గడిచిపోయింది. పిల్లలు ఆమెనే పట్టుకుని వేళ్ళాడేవాళ్ళు. ఆమెకు చదువు దాదాపు లేదనే చెప్పాలి. నిష్ఠ జాస్తి. మూఢ విశ్వాసాలు కూడా జాస్తే. తన పిల్లలు అస్పృశ్యులను తాకరాదు. గ్రహణం కేసి చూడరాదు.

మోహన్‌దాస్‌కు అన్నీ అనుమానాలే. ఇల్లూడ్చే వాణ్ణి తాకితే ఏమవుతుంది? గ్రహణం కేసి చూసినవాడికి ఏం నష్టం



కలుగుతుంది? తల్లి ఏదో చెప్పేది. కొడుక్కు తృప్తి కలిగేది కాదు. అయినా అతనికి పెద్దయాక కూడా తల్లి అంటే చాలా గాఢమైన అభిమానం ఉండేది. పెద్దవాడై "నాస్తికత్వం" అవలంబించి ఉన్నా తల్లి యొక్క దీక్షా, పట్టుదలా అంటే అతనికి ఎంతో అభిమానం ఉండేది. మాతృప్రేమ అన్నది అతనిలో పరిపాకానికి వచ్చి సర్వమానవ ప్రేమగా రూపొందింది. ఇతరులలో ఆత్మస్పందన కలిగించి సానుభూతి సంపాదించటమూ, ఆత్మత్యాగమూ అనేవి స్త్రీలు అనాదిగా ఆచరణ చేస్తున్నవే. వాటిని గాంధీ తన తల్లి నుంచే అలవరుచుకున్నాడు. తనలో ఏమైనా పవిత్రత అన్నది ఉంటే అది తన తల్లి నుంచి సంక్రమించినదే గాని తండ్రి నుంచి కాదని గాంధీ తన 62వ ఏట చెప్పుకున్నాడు.

మోహన్ తన తండ్రి కరంచంద్‌కు యాభయ్యో ఏట పుట్టాడు. తండ్రి అంటే అనురాగం లేదు గాని భక్తి చాలా ఉండేది. అతను ఈ భక్తి భావాన్ని గురువుల వద్దా, పెద్దల వద్దా కూడా చూపి, ఆత్మవిశ్వాసం లేని బాలుడుగా తయారయాడు. ఉపాధ్యాయులు అతన్ని అంత తెలివైనవాడుగా పరిగణించేవారు కారు. ఎప్పుడైనా దారి తప్పి తన కొక బహుమతి లభిస్తే, అతను చాలా బిడియపడి, అలాంటి బహుమతికి తాను అర్హుణ్ణి కాననుకునేవాడు.

అసలే పిరికివాడైన మోహన్‌కు పదమూడవ ఏటనే పెళ్ళి చేశారు. అతని అన్న కర్సన్‌దాస్‌కూ, మరొక దాయాదికీ పెళ్ళిళ్ళు అవుతున్నాయి. మూడు పెళ్ళిళ్లు కలిపి చేస్తే ఖర్చు కలిసి వస్తుందని మోహన్‌కు కూడా ఒక భార్యను ముడి పెట్టేశారు.

మోహన్‌కు నిర్ణయించిన వధువు తండ్రి పోర్బందర్‌కు చెందిన వర్తకుడు గోకల్‌దాస్ మకాన్జీ. వధువు పేరు కస్తూర్‌బాయి.



# 88. బ్రహ్మాండమైన రాతితల

మెక్సికో దేశంలో ట్రెస్ జపోటెస్ వద్ద 1939 లో దొరికిన ఈ రాతితల ఎత్తు 6 అడుగులు, కైవారం 18 అడుగులు, బరువు 10 టన్నుల పైచిల్లర. దీనిని క్రీస్తుపూర్వం ప్రాచీనులు బసాల్టు రాతిలో మలిచారు. ఇది దొరికిన స్థలానికి 10 మైళ్ళ దూరంలో ఇలాటి రాళ్ళు లేవు. ఈ శిల్పాన్ని టక్స్ట్లా కొండల్లో తయారు చేసి ఇప్పుడున్న చోటికి ఎలాగో చేరవేశారని పరిశోధకులు ఊహిస్తున్నారు.



Photo by R. A. Jamsandekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రేమతో చూస్తే

పంపినవారు:
కె. ఆర్. పి. రావు, ఏలూరు

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆశతో వచ్చా

పంపినవారు:
కె. ఆర్. పి. రావు, ఏలూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 మే నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ప్రేమతో చూస్తే

రెండవ ఫోటో: ఆశతో వచ్చా

పంపినవారు: కె. ఆర్. పార్థసారథిరావు,

ఏలూరు — 1.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# భద్రతకి ఆమె దగ్గర తాళంచెవి వుంది

ప్రమాదాల కెన్నడూ ఆమె తావు ఇవ్వదు, విలువైన తన నగలన్నిటినీ ఆమె పూర్తి భద్రతవున్న పియన్‌బి 'లాకర్ల'లో దాచింది. దీనికోసమయ్యే ఖర్చులు కూడా చాలా నామమాత్రమైనవే...ఇవి కేవలం ఏడాదికి 20 రూపాయలు...అంటే రోజుకి 6 పైసలకన్నా తక్కువన్న మాట. మీ విలువైన వస్తువులు పూర్తి భద్రతతో వుండేందుకు ఇంత స్వల్పమైన ఛార్జీలు చెల్లించటానికి మీరేమాత్రం లెక్క చెయ్యరు.

'లాకర్లు' కేవలం విలువైన వస్తువులకోసమే ప్రత్యేకించబడినాయి, మీ విలువైన వస్తువులు పియన్‌బి లాకర్లలో సురక్షితంగా వుంటాయి.



## పంజాబ్ నేషనల్ బ్యాంక్

*1895 నుంచి జాతికి సేవ చేస్తున్నది*

బ్యాంకు ఛైర్మన్: యస్.పి. త్రిఖా

PR-PNB-6813 TEL-I

*FOR PRECISION IN...*

# Colour Printing

*By Letterpress...*

...Its B. N. K's., superb printing
that makes all the difference.
Its printing experience of
over 30 years is at the
back of this press superbly
equipped with modern
machineries and technicians
of highest calibre.



# సుఖమెరుగని రాజకుమార్తె

సూర్యరాజు సామ్రాజ్యంలో
విచారం ప్రబలింది
... అందాల రాకుమార్తెకి
ఎప్పుడూ ఆనందంలేదు

రాజు మంత్రుల ఉపదేశం కోరతాడు
కానిలాభం లేకపోయింది ...,



అమూల్యమైన కానుకలూ
ఆనందాన్ని కల్గించలేదామెకు...



రాజ్యంలో విచారం సుస్థిరమైపోయింది.



ఓనాడో అందమైన రాజకుమారుడు గుర్రం దిగే దిగటంతో
సుఖమెరుగని రాజకుమార్తెను చూస్తాడు



కోటలోపల ...







రాజ్యంలో సంతోషం తిరిగి
తాండవిస్తూంది ...




BB 4747

గంగాధర్

"ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు, చూడ చూడ రుచుల జాడ వేరు"
చిత్రాలలో **వాహినీ** చిత్రమే వేరు

వస్తూంది!





వాహినీ వారి

# బంగారు పంజరం

నిర్మాత-దర్శకుడు: బి.యన్.రెడ్డి

విజయ రిలీజ్

